# జీవనరంగం

( మొదటి భాగం )

★

*8 ఏకాంక దృశ్యనాటికలు.*

★

వేదోద్ధారక గ్రంథమాల

ప్రచురణము 17.

## ఈ సంపుటిలో —

# సంఘర్షణ

—

రచయిత :

శ్రీ మల్లికార్జున్



జననం : 1932

నివాసం : హైద్రాబాదు

అభిరుచి : సారస్వతం.

రచనలు : గేయాలు, గేయనాటికలు వివిధ పత్రిక[redacted] ప్రచురింపబడ్డాయి.

అభిమాన రచయితలు : కాళిదాసు, శ్రీశ్రీ. దాశరథి. నారాయణ రెడ్డి.



పాత్రలు :

కవిత్వం

సంగీతం

నృత్యం

శిల్పం

చిత్రలేఖనం

రసం



# మనవి

గ్రంథం ప్రచురించటం మా పని,

విలువ కట్టటం మీ పని.

మా కోరికను మన్నించి రచయితలు సహకరించారు. కృతజ్ఞతలు. ఇది మొదటి భాగం మాత్రమే. రెండో భాగం కూడా త్వరలో అందిస్తాం. ముఖ చిత్రం అందించిన శ్రీ జి. కె. సూర్యంగారికి కృతజ్ఞతలు.

సదా మీ సహకారాభిలాషి,

వట్టికోట ఆళ్వారుస్వామి

స్థాపకుడు, ప్రకాశకుడు.

# దేశోద్ధారక గ్రంథమాల

## విజ్ఞప్తి

మహాశయా!

ఆంధ్ర సోదరులకు అవసర గ్రంథముల నందించు ఆశయముతో బహుధాన్య (౧౯౩౮) సంవత్సరంలో శ్రీ॥ శే॥ దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి స్మారక చిహ్నముగా స్థాపింపబడిన ఈ గ్రంథమాల ద్వారా లోగా ౧౨ ప్రచురణములు దేశీయుల కందజేసినాము. ఆ రోజుల్లో విజ్ఞానము నిచ్చి, స్వాభిమానమును పురికొల్పి, సత్య కర్తవ్యమును తెలుపు గ్రంథములను ప్రచురించి దేశభక్తుల యొక్కయు, మేధావంతుల యొక్కయు మన్ననలను పొందినాము. పిమ్మట మొత్తము భారతదేశంతోపాటు హైదరాబాదులో యేర్పడిన రాజకీయ అసాధారణ పరిస్థితులలో గ్రంథమాల ౧౯౪౭లో ఆగిపోయినది. ౧౦ సంవత్సరముల తర్వాత కొంత స్థిమితపడి, తిరిగి గ్రంథప్రచురణకు పూనుకొను అవకాశము లభించింది. గ్రంథమాల స్థాపకాలములో మా ముందుండిన కర్తవ్యము నేటివరకు తీరలేదని భావిస్తున్నాము.

'మనిషి యే పంథా నవలంబించవలయునో అని ఆలోచించుటకు ముందు ఏయే పంథాలను తెలిసికొనుట ముఖ్యము.' కాబట్టి మేము ప్రచురించు ప్రతి గ్రంథము దేశీయుల ఆకాంక్షలను, హక్కులను, బాధ్యతలను దృష్టియందుంచుకొని కర్తవ్యములను సూచించునదిగా నుండును.

ఇట్టి మా కృషికి చేయూతనిచ్చి మా ఆశయ సఫలతకు దేశీయులు మమ్ము ప్రోత్సహించెదరని విశ్వసిస్తూ, విజ్ఞులగువారి సర్వసహాయాలపై మాత్రమే ఈ వ్యవస్థను నిర్వహించ గలుగుదుమని విన్నవిస్తున్నాము.

పది రూపాయలకు తక్కువగాని విరాళమును మీ నుండి అర్థిస్తూ, అట్టి మొత్తము మేరకు వెలువడే గ్రంథాలు అందజేయబడునని మనవిచేస్తున్నాము.

3-5-1027 నారాయణగూడ
హైదరాబాదు.

ఇట్లు విన్నవించు
వట్టికోట ఆళ్వారుస్వామి
స్థాపకుడు, ప్రకాశకుడు

# సంఘర్షణ

కవిత్వం :

స్వరం పొందినవారికి
చేకూర్చెద ఆహ్లాదం -
లలితితో మండు మెదడు
చిందించెద ఆనందం -
మధురగీతికల నల్లుచు
ప్రజకుబాధల హరింతు -
సిరిసమృద్ధి భీతిల్లగ
నిఖిలలోకముల చరింతు.

సంగీతం :

కంఠం విప్పని కళామతల్లికి
స్వరాలు నేర్పితి నేనే -
లయ కలిగగా సంగీతరసం
గానం సృజించితి నేనే -
నా నునువెచ్చని రాగాలాపన
సంపత్తింపను లతాద్రుమమండలి -
నా స్వరసమ్మతితో నాట్యములాడ..
ధ్వని పాటను తాపగించుము

నృత్యం :

లలితహస్తములందు
ప్రభవించి ప్రవహించి -
రసిక హృదయములందు
చిగురించి రంజించి
అర్ధనారీశ్వరుని

ఆనందమున ముంచి -
నిఖిల లోకములందు
నేనె ' కళ ' యనబడుదు.

శిల్పం :

నన్ను ముట్టిన బండ
భగవానుడై యుండ -
భక్తులే నాయంద
భజనసల్పుచునుండ -
మానవత్వమును నా
లో నిల్పుకొన్నాను -
ఎల్లకళలకు పుట్టి
నిల్లునై యున్నాను.

చిత్రలేఖనం :

ప్రకృతిసీమ సౌందర్యం
పరుగులెత్తు నాలో -
మధురభావనా వీచిక
మాటలాడు నాతో -
యుగయుగాల వసంతాలు
చిగురించును నాలో - .
నందనవన స్మృతి గాథలు
నర్తించును నాలో.

కవిత్వం :

నాటికి నేటికి మేటిని నేనే
కాళిదాసునకు కన్నతల్లినై
పోతన్నకు నే మోక్షదాయినై
కాలము నోడించితి నేనే
కాంచను నాసరి నెవ్వరినీ.

సంగీతం :

నాటి కృతుల యీ
నాటి గళంబులు
సాటిలేనివని
చాటిచెప్పగా
త్యాగరాజునే స్మరింతును
రాగముతోనే తరింతును.

నృత్యం :

నా జయస్తంభా
లజంతాగుహాంతరాన
నా ప్రశంసాక్షరులు
శివతాండవములోన
సౌందర్యము నాలో పొంగగా
సాహిత్యముగా చెక్కిరోగా

శిల్పం :

శిలాప్రతిమ కన్నులలో
శిలాఖండముల తపస్సు -
పల్లవాంగి మెలికలలో
ప్రభవించునుగా ఉషస్సు -
ఎల్లోర గుహాంగణాన
పల్లవించు నా యశస్సు.

చిత్రలేఖనం :

జగజగాల జీవితాల
బోధించును నా లేఖిని -
విశోమయ జగత్తులోని
అమరత్వం నా కామిని -

రసిక జనామోదంతో
విరియింతు, పురోగామిని.

కవిత్వం :

సరిగమపద సంగీతం
శ్రోతలకు శిరోవాతం -
ఉన్మాదినియై నిత్యం
ఊగి సాగునీ నృత్యం -
పిచ్చుటంత కెక్కించును
పనికిరానే యీ శిల్పం -
పిచ్చివాడి మార్గంలా
చిత్రలేఖనపు గమనం.

సంగీతం :

అవిరాంగుల పరిహాస్యాల
పట్టినదే కవిత్వం -
లౌకిక భావాల నెల్ల
కల్పించునుగా నృత్యం -
దాచుకొనిన రహస్యం
విప్పిచెప్పు నీ శిల్పం -
సిగ్గులేని స్త్రీవలె కా
న్పించు చిత్రలేఖనం.

నృత్యం :

ఊహల పొలిమేరలలో
విహరించును కవిత్వం -
భావరహిత నాదమ్ములు
వెల్లువేయు సంగీతం -
జగానికే అత్యల్పం

చలనరహితమౌ శిల్పం -
హృదయాలను స్పందింపని
వదే చిత్రలేఖనం.

శిల్పం :

శిల్పరహితమౌ కవిత్వం
కల్పనయే కానేరదు -
ఖరస్వరపు సంగీతం
పరువు నిల్పుకోనేరదు -
అందము నివ్వగజాలదు
అడుగుదప్పితే నృత్యం -
శిల్పరహితమౌ చిత్రం
రసం లేని కావ్యం.

చిత్రలేఖనం :

భావపుష్పాల చిత్రణమే
కవిచేసిన ఘనకార్యం -
స్వరభేదం తెల్పుటయే
సంగీతపు నాదత్వం -
భావపుష్పాల ప్రదర్శనమె
కావించునుగా నృత్యం -
వికసించెను స్వేచ్ఛగా
విశ్వకవి ప్రప్రథమం.

రసం :

గుణపుష్పంతో మరు
కలహించుటలేా
పరువువీడుట కళా
భాస్వరముగారా ।

అమృతాల వర్షింపు
ఆనందసీమ.
సంఘజీవుల మీరు
సంఘటితపర్చాలి
స్వార్థాల తొలగించి
శాంతి చేకూర్చాలి.

కవిత్వం :

నన్ను మీరు నిందింపగ
న్యాయంబేయగునా ?
సౌభాగ్యనిరోధకుడై
నా వృద్ధి కగునా ?

సంగీతం :

నన్ను మీరు హీనపరచి
నా కెందుకు స్వామి ?
నాకంఠం బంధింపగ
సహించాలం టేమి ?

నృత్యం :

పోరా ! ఉన్మాదినినట
అలసియుండ నౌదునా
అంద రాడిపోయినంత
నోరుమూసికొందునా ?

శిల్పం :

అందము నే చిందింపక
ఇచ్చలంత కీర్తుదునట
పరిహాస్యాలు చెప్పుటయే
నే చేసెడి ప్రవృత్తియట.

చిత్రలేఖనం :

సిగ్గులేనివానినియట
పిచ్చివాడ నౌదునట
శిల్ప మొకింత యెఱుగాదు
కల్పన నాలో లేదట.

రసం :

ఓహోహో మఱియు వ్యా
మోహముతో మునిగినాడు
చెడ్డతలంపుల కెరలి
గ్రుడ్డివాడ యయినాడు
మఱి సమ్మతించనిచో
మీ రోషమ్ముల జూపుడు
మఱియు శాంతించనిచో
మీ సంఘర్షణ నాపుడు.

తి సం. స్వ. వి. ప.

అయినను నానింటి
అంగీకరించితిమి
పక్షపాతము లేని
పలుకులాలించితిమి.
తప్పులను మన్నించి
మమ్ములను కరుణించి
ఎవ్వ రెవరో మాకొ
అధికులెవరో చూచి
తీర్పుచేయుము నేడు
న్యాయమును శోధించి.

రసం :

శిల్పంలేని కవిత్వం
సిగ్గులేని స్త్రీ అందం.
కవితలేని సంగీతం
కర్ణ కఠోరం.
గీతరహితనృత్యం
సుడిగాడ్పు సహాసం.
కవితలేని శిల్పాలను
కామించదు సౌందర్యం.
శిల్పం లేకున్న చిత్ర
లోకం చిగురింపబోదు.
అన్యసహాయమ్ములేక
ఆడలేరు పాడలేరు.
ఆశించిన ఆనందం
అందివ్వగలేరు
ఆశయాల సంపూర్తికి
అది మార్గం కాదు
స్వార్థం వీడిననాడే
అర్థింతురు మిమ్ము
ఆశను త్రోసిననాడే
ఆశింతురు మిమ్ము
బ్రదుకుబాట పదిలపరచ
భాగస్థులు కండి
భాగ్యహీనులను మీరే
ఆదరించి పెంచి
పోషిస్తుందయ్యా
సహధర్మం యిస్తున్నైన
గర్వం చిగురింపలేదు
కళాసేవ కాన - -

# తారుమారు

రచయిత :

శ్రీ ధరణికోట శ్రీనివాసులు



జననం : 1916

నివాసం : నల్లగొండ

అభిరుచి : కథాసాహిత్యం, నాటకాలు, సంగీతం, హాస్య రచనలు.

రచనలు : ముద్రితం : మాయింట్లో (కథానికలు.)
అముద్రితాలు : అనేక కథలు, నాటికలు, రేడియో నాటికలు, ప్రసంగాలు.

అభిమానరచయితలు : మునిమాణిక్యం నరసింహారావు, కొడవటిగంటి కుటుంబరావు, దాశరథి, సి. నారాయణరెడ్డి, బూర్గుల రంగనాథరావు.

ప్రభుత్వోద్యోగములో ఉన్నారు.



పాత్రలు :

మోహన్‌రావు

రామం

అవధాని

మురళి

పేరంటం

దేవకీదేవి



మో: - యిప్పుడేం కర్తవ్యం అవధాన్లగారూ! యింట్లోకి వివాహానికి పూర్వం రాగూడదంటే ఆయనగారికేం కోపంవస్తుందో నేను యేలాగు చచ్చేదండీ అవధాన్లగారూ!

రామం:-- మళ్ళీ చాపు - చాపు...(వెళ్ళి పోబోరాటు)

మో:-- చార్లే రామం. .నీవు వెళ్ళబోకు .మళ్ళీ మళ్ళీ అని చాపటు. యిది పరిహాసాలకు సమయం కాదు. నాసెత్తిన పిడుగు పడి పోయింది రామం. బుద్ధి పనిచెయ్యడం లేదు అవధాన్లగారూ! ... రామం .నాకేమైనా ఆలోచన చెప్పండర్రా మీమీ పుణ్యం వుంటుంది.

రామం: - ఆలోచనకిల్లా యేముందండీ. అల్లుడు వచ్చి యింటిముందు నిలుచున్నాడాయెను. యిప్పుడు మనం కూర్చున్న వసారాలోకి వస్తేమాత్రం తప్పేముంది బావా! యేమంటారు? అవ ధాన్లగారూ!

అవ:-- (నిట్టూర్పువిడిచి) యెంతమాత్రం పనికిరాదువెంటి. మనం సాంప్రదాయాలు చూసుకుందామా లేక మొహమాటాలు చూసు కుందామా? మోహన్‌గారూ! జ్ఞాపకం వుంచుకోండి. యిది కలి యుగం. సాంప్రదాయాలకు విరుద్ధంగా మనం యేమి చేసినా లోకులు కాకుల్లాగ పీకుకుతింటారు. కాస్త ఆలోచించి మరీ చెయ్యండి.

మో:— అయితే అవధాన్లగారూ! నేనువెళ్ళి బయట ద్వారంవద్ద ఆయనతో మాట్లాడుతాను. లోపలికి రావడం బాగుండదని నచ్చ చెప్తాను. అయినా యిప్పుడు ఆయనకున్న పనేముంది మన యింట్లో. . యేమిటో. యేమీ తోచడంలేదు. అయితే అవధాన్లగారూ! మీ రిద్దరూ యిచటనే వుండండి. నేను ఆయనతో మాట్లాడి వస్తాను.

రామం:- కాని బావా కాస్త జాగ్రత్త. మాటల ధోరణిలో మళ్లీ చావుటూ బ్రతుకులు అని ఆయన్ని నొప్పించేశేవు.

మో:—చాల్లేపోయి. మళ్లీ ఆవేశపు మాటలూ నీవూను.

[తెర]

## రెండో రంగం

ప్రదేశం—యింటిముందు

[వేపచెట్టుక్రింద మురళి పచార్లు చేస్తుంటాడు. నోట్లోనుంచి సిగరెట్టు పొగ గుప్పు గుప్పు మని వదుల్తుంటాడు]

మో.—(ప్రవేశిస్తాడు)

మురళి.—నమస్కారమండి (సిగరెట్టు మూలంగా పారేసి వినయంగా నిలబడి వుంటాడు.)

మో.—యేం నాయనా యేదోపనిమీద వచ్చినట్టున్నావే అయ్యో నిలబడే వున్నావే. నా తెలివి తెల్లవారినట్టేవుంది. అరే వేంకటలు ఓరి వేంకటం—యెక్కడ చచ్చావురా. రెండు కుర్చీలు పట్టుకురారా.

మురళి: అక్కర్లేదులెండి—యింట్లోకే పదండి.

మో. ఆ యింట్లో కెందుకు నాయనా కాదుకాదు మీరు యేమి అనుకోకండి నేను యిలాగంటున్నానని ..యేదో రేపు రాత్రికి ముహూర్తం అనుకున్నాం కదా అంతకు పూర్వం యింట్లోకి రావడం బావుండదేమోనని. అంతే. నలుగురు నాలుగు విధాల అనుకుంటారు నాయనా. నలుగురిమాటెందుకు? అసలు మీనాయన గారు యేమనుకుంటారా చెప్పండి. యేదో మీది కుర్రతనం కాబట్టి యీ కష్టసుఖాలు తెలియవు మీకు.

మురళి.—యీ సాంప్రదాయాల మాటలకేంలెండి. అసలు నేను వచ్చింది మీకూతుర్ని చూడడానికి. నాకు తెలియకుండానే ముహూర్తం నిశ్చయం చేసుకొని నన్ను బొంబాయినుండి పిలిపించారు. కాని నేను అమ్మాయిని చూడలేదు. ఆవిడను చూడకుండా పెళ్లి యెలాగు చేసుకొనేది చెప్పండి.

మో:-మీవాళ్లంతా అమ్మాయిని చూశారు. అమ్మాయికేం బంగారు తునక. యేమీ వంకలేదు.

మురళి:-అయినా నేను అమ్మాయిని చూడందే పెళ్లి చేసుకోనండి. పెళ్లి నాది- యింకెవరిదీ కాదు.

మో.-అంతపట్టుపట్టితే యేలాగునాయనా? పెద్దవాణ్ణి నామాట విను. మీ నాయన ఒకటి నేను ఒకటీనా. రేపిపాటికి అంతా అయిపోతుంది. ఒక్కరోజా కాపురం యెందుకీ పాడుప్రపంచంలో అను పెంచుకోవడం.

మురళి-పోనిద్దురూ పెధవ ప్రపంచంతో నాకేంపని? నేను మాత్రం అమ్మాయిని చూడకుండా పెళ్లి చేసుకోను. మీకైనా సరె పర్వాల తమ యిష్టం.

మో. తొందరపడకు నాయనా కాస్త ఆలోచించు.

మురళి:-నేను యెక్కువ మాట్లాడదలచలేదండీ. అమ్మాయిని చూపించడం యిష్టంలేకుంటే మీరు యింకో సంబంధం చూసుకోవచ్చు. (వెళ్ళిపోబోతాడు)

రామం:-(ప్రవేశిస్తాడు) ఆగండి. ఆగండి. అంత తొందరపడుతున్నారేం? మా దాసగారు పాతకాలపు మనిషి. యేదో అన్నారు. దానికేం లెండి..... రండి అమ్మాయిని చూద్దురుగాని (మురళి చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకువెళ్ళుతాడు)

మో:-నాకు చావైనా వచ్చిందిగాదురా దేవుడా! (నెత్తిబాదుకుంటాడు)

[తెర]

## మూడో రంగం

ప్రదేశం:-యింటివసారా

[అవధాని, మోహన్‌రావు, రామం, మురళి కుర్చీల్లో కూర్చొనియుంటారు]

అవధాని:-అమ్మాయిని చూడక తప్పదంటారా.

మురళి:—అప్పనంటీ చూడక తప్పదు.

మో:—యివ్వాళ్ళ తిథి నక్షత్రాలు యెలాగున్నాయో! యేం అవధాన్లగారూ.

అవ:—తిథి వార నక్షత్రాల కేంటెండి. (పంచాంగం విప్పి చూస్తాడు) బాగానేవుందే.

మురళి:—పోనిద్దురూ. యింకా బూజుపట్టిన భావాలు. పూర్వం మాత్రం అమ్మాయిని చూడకుండా పెండ్లి చేసుకున్నారంటంటే స్వయం వరాలుండేవి వినలేదూ!

అవధాని:—సరే.... మోహన్‌రావుగారూ కానివ్వండి యేంచేస్తాం. శుభస్య శీఘ్రం.

మో:—రామం, అమ్మాయిని తీసుకరా.

(రామం లోపలికి వెళ్ళి దేవకీదేవితో మళ్ళీ వస్తాడు)

మో:—అమ్మాయి రా రా.... కూర్చో.... వరాయివాళ్లెవరూ లేరు రామమ్మా.

దేవకి.—(కూర్చుంటుంది ఓ కుర్చీలో)

మురళి:—అమ్మాయి పేరు?

రామం: దేవకీదేవి.

మురళి:—అబ్బో రాచబిడ్డ పేరు.... చాలా బావుంది. (అమ్మాయిని బాగా పరిశీలించి చూస్తాడు) అమ్మాయి. ఇంగ్లీషు చదువుకున్నావా!

దేవకి:—(సిగ్గుపడుతూ అవునన్నట్టుగా తలవూపుతుంది.)

రామం:—ఓ ఆంగ్లో ఇండియన్ లేడీవద్ద చదివించాము.

మురళి:—యేదీ ఈ న్యూస్ పేపర్‌లో యెదైనా చదివి వినిపించు అమ్మాయి. (చేతిలోవున్న ఇంగ్లీషు పేపరు అమ్మాయిచేతి కిస్తాడు)

చేపకి:—(పేపరు చదువుతుంది.)

"The appeal issued by leading workers in the Women's Movement in the state supporting the candidature of woman candidates in the forthcoming elections would be echoed by people all over the state."

మునిసి:—వాయి వాయి ,.. ఎక్సెలెంట్... వండర్‌ఫుల్, నైస్. మంచి ఉచ్చారణ. ఆంగ్లో యిండియన్ లేడీ వద్దగమా చదివించారా! అసలు ఆదీసిహాస్యం- యే యితరులో చెపితే అంతగా వాగుండక పోప్పను ఉచ్చారణ . సరి. కాని అమ్మాయీ! నీకు సంగీతం వచ్చా

రామం—ఎప్పుసండీ. రః పూళ్ళోపున్న ఆధునిక నటన సంగీత విద్యాలయంలో సంగీతం చెప్పించాము.

మునిసి —ఓ పాట పాడు అమ్మాయి వింటాను.

మో:—ఆ. పాట బాగా పాడుతుందండీ!

మునిసి యేం అమ్మాయి సిగ్గుపడుతున్నావా యేమిటి? విద్యను ప్రదర్శించ దానికి సిగ్గెందుకూ?

రామం—పా డమ్మాయి పాడు.... సిగ్గెందుకు?

చేపకి (పాట పాడుతుంది)

పాట.

శ్రీరామా సీతారామ - కాపాడ రావ
భక్తలోకపాల రామా - జాలమేల రావా
కాపాడ రావా. శ్రీరామా॥

మునిసి: ఎక్సెలెంటు. మార్వెలెసు .. నాకు అమ్మాయి నచ్చిందండీ. యింకా వస్తానండీ (లేస్తాడు)

[రామం, మోహన్‌రావు మురళిని సాగనంపడానికి అతని వెనక నడుస్తుంటారు]

దేవకి:—(కుర్చీలోంచిలేచి) నాన్నగారూ ఆగండి. వారు మాత్రం నాకు నచ్చలేదు. వివాహానికి పూర్వం కన్యలను పరీక్షించే అధికారం మొగాళ్ళకుంటే ఆడపిల్లలకు గూడా మొగాళ్ళను పరీక్షించే అధికారం వుండాలి.... వారిని పెళ్లిచేసుకోవడం నా కెంతమాత్రం యిష్టంలేదు.

మో:—ఆ వూరుకో అమ్మాయి. తప్పు. అలా నీవు అనకూడదమ్మా

మురళి: (అమ్మాయివద్దికివచ్చి) అదేమిటమ్మాయి- నన్ను పరీక్షించండే ఫేలు చేశావే!

దేవకి:—(తండ్రితో) వారిని పరీక్షించడం నా కనవసరం వారికి నాకూ ఆకాశానికి భూమికి వున్న తేడావుంది. నేను భారత స్త్రీని ..

మురళి:—నేనూ భారతీయుడ్నేగదూ!

దేవకి: -(తండ్రితో) .. కాని వారు విదేశీయ సంస్కృతిగలవారు. నేను వివాహాన్ని ఆత్మబాంధవ్యంగా యెంచుకుంటాను. వారు కేవలం శరీరబాంధవ్యంగా యెంచుకుంటారు.

మురళి:—ఓహో అలానా - బాగా కనిపెట్టావే!

దేవకి:—వారికి నచ్చిన నా సౌందర్యం, గ్రాహ్యమైన నా గొంతు యే వ్యాధి పీడితమయ్యో చెడిపోయిన వారి కళ్లు నన్ను చూడనొల్లవు. వారికి దోరెడు విజ్ఞానం వుండొచ్చు కాని ఏమంత మానవత్వం వున్నట్టు నా కగపడడంలేదు.

మురళి: మ్యానర్సు ప్లీస్ ఇన్సల్టు చేస్తున్నావు జాగ్రత్త.

దేవకి:—సంత విక్రయ పశువును చూచినట్టు వారు చూస్తున్నారు నాన్నారూ! వీరు సౌందర్యం ఒంపులూ, రూపు రేఖలు ఆరాధించే వారనే విషయం మీరు మరువకండి...

మురళి:-యస్ ఎగ్జాక్ట్లీ (Yes, exactly)

దేవకి:- నన్ను పశుప్రాయంగా ఈ సౌందర్యోపాసకులకు బలి యివ్వకండి. వివాహాన్ని ఆత్మ బాంధవ్యంగా యెందుకనే యువకుడే నాకు కావాలి... నాన్నారూ! వారితో చెప్పేసెయ్యండి. నాకు వారు బొత్తిగా నచ్చలేదు. వారిని నేను వివాహం చేసుకోను. యిది నా దృఢనిశ్చయం.

మో:-దేవకీ.... నా ముద్దుబిడ్డా. నీయిష్టమే లేనితర్వాత అంతా ఒట్టిదే నమ్మా (మురళివైపు చూస్తూ) వింటున్నావు కదా నాయనా, అమ్మాయికి నీవు నచ్చలేదట... నాకు చాలా విచారంగావుంది. యింకెక్కడైనా నీయిష్టంవచ్చిన అమ్మాయిని వివాహం చేసుకో. మీ నాయన గారికి ఈవార్త అందచేస్తాను.

మురళి:-(కోపంగా మోహన్‌రావును అమ్మాయిని చూస్తాడు) బ్రూట్స్. స్కౌండ్రల్స్ (అంటూ వెళ్ళిపోతాడు)

రామం:-యేమిటి యిదంతా అమ్మాయి. యిక యీ పెళ్లి యెత్తిపోవలసిందేనా? ప్రపంచం యేమంటుంది.

మో:-పాడు ప్రపంచం యేమన్నాసరే రామం. నీవు మాత్రం అమ్మాయిని యేమన్నా ఒప్పుకోను. ఆత్మగౌరవంగల ఓ భారత స్త్రీ చెయ్యవలసిన పని చేసింది అమ్మాయి. యిలాంటి కన్యలను శ్లాఘించక పోవడం మనకెంతైనా సిగ్గు. యిక వివాహం గురించా నా కెంత మాత్రం విచారంలేదు. నా ముద్దు బిడ్డకు యెవరైనా దొరుకుతారు. (అమ్మాయి తల నిమురుతూ ముద్దెట్టుకుంటాడు) రామం, అమ్మాయిని యింట్లోకి తీసుకెళ్లు.

రామం:—(అమ్మాయితో లోపలికి నడుస్తూ) My god. కథంతా అడ్డం తిరిగిందే! (లోపలికి వెళ్ళిపోతాడు)

మో:—అవధాన్లగారూ! చూశారా! అంతా వాయమూరు కాలపరిణామం. మనచేతిలో యేమీలేదు. యేది యెటయినా మనకీ యింకో సంబంధం చూడలేక నాకు చావొచ్చింది

అవధాని:—తథాస్తు. శీఘ్రంగా రాసిలసిందే

మో:—(నోరు తెరచి) ఆ...ఆ.. అలాగంటారేమండీ!

అవధాని: —అబ్బే.... కల్యాణం అనుకున్నాను.

*[యిద్దరు విరగబడి నవ్వుతారు.]*

( తెర )

---



# పగ!



రచయిత :

శ్రీ పొట్లపల్లి రామారావు

జననం : 1920

నివాసం : తాటికాయల, తా॥ వరంగల్

అభిరుచి : సారస్వతం.

రచనలు : ముద్రితం : 'జేలు' (కథానికలు) కథానికలు, గేయాలు, నాటికలు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి.

అభిమాన రచయితలు : గోర్కీ, పెర్ల్‌బక్, విలియం సారాయన్, రోమా రోలాండ్, టాల్‌స్టాయ్, పోతన, రాయప్రోలు సుబ్బారావు, చలం, ప్రేమ చంద్, కిషన్‌చందర్.



పాత్రలు :

పుల్లయ్య

సర్సయ్య

ఒకటవ పోలీసు

రెండవ పోలీసు

నరసింహారెడ్డి

అమీన్

ఎలవాడు

# పగ!

## ఒకటో రంగం

### రైతు ఇల్లు

పుల్లయ్య:- మొన్న సింగారం అమ్మనువస్తే సోలెడు బియ్యం కావాల్నంది. యిచ్చినోడు లేడట. రాముల్లు మీదగ్గర లేవంటె. మీదగ్గర లేవని, జవాన్లు పలిచినా. చేయిపట్టి యాచ్చినా. ఎవరూ కదల లేదట.

సన్నయ్య:- బియ్యం పోనీయి. మళ్ళీ ఆ ఊళ్ళోనుంచి పోదామంటే బండి దొరకలేదు. ఎవరు యిస్తరు?

పుల్లయ్య:- వెళ్ళాపోయిందా మరి?

సన్నయ్య:- వాళ్ళు నెత్తిన పెట్టుకోని ఏంచేస్తరు? ఊళ్ళో నింపబడితె పరువు దక్కేటట్టు లేదాయె. ఊరును ఏమిచేస్తనో చూడు అని మండిమండిపోయిందట.

పుల్లయ్య:- మాట మళ్లె మరి!

సన్నయ్య:- అది వినరాదు! సాకలోళ్ళు అంతా యిండ్లల్లో లేమని తప్పించుకున్నారట. రూపాయి, రూపాయి, యిస్తమంటే, అయినా ఎంతో బ్రతిమిలాడితె, యిద్దరు కూలోళ్లు వచ్చిండ్రట. వాళ్ళైనా రూపాయలు చేతులపెడితినె, వస్తమన్నారట. చేపుదా! అనుకుంటూ పడేయి ఎక్కడ్డో తెచ్చి యిచ్చిందట అప్పుడు.

పుల్లయ్య:- కూలోళ్ళు మాగవారికింద్రు. వాళ్ళకు ఏమొచ్చింది మర్చిరి?

సన్నయ్య:- మన పెద్దయ లేరు? అమ్మనుమ ఎక్కడి మనకు వరుగు తదో! యెక్కడ నొప్పి అయితదో! యేమి కావొస్తదో! అని యెంతభయం యెంతబాధ వాళ్ళకు.

పుల్లయ్య:- ఈ ఊరి పెద్దలందరిని నీళ్ళులేని దగ్గర ...

నర్సయ్య:- వీళ్ళబలము చూచుకొనేనాయె, మనని వాళ్ళు పీక్కుతినేది ; లేకుంటే మనమీద చేయివేయడానికి ఎన్నిగుండె లుండాలె వీళ్ళకు?

పుల్లయ్య:- వాళ్లకు ఇంత యెంగిలి దొరికితె సరి ...

నర్సయ్య:- జాగీరులో యీ పెద్దలంవరు కలిసె పట్టి యిచ్చింద్రట . . నారాయణపంతులును.

పుల్లయ్య:- మనవాళ్ళె మనయింటి మర్మం చెపుతుంద్రు. యింటిదొంగ ప్రాణగండం

నర్సయ్య:- నరసింహారెడ్డి వెంబడి పడ్డరు వీళ్లిప్పుడు. ఆయనను ఎట్ల యినా పట్టి యివ్వాలెనని యెన్నో ఆలోచనలు, యెన్నో వేషాలు, యెన్నో పన్నాగాలు పన్నుతాంద్రు...

పుల్లయ్య:- ఆయనగాని వీళ్ళకు దొరకడు. ఎవనికడుపుల యేమున్నదో ? ఎక్కడేం దొంచవున్నదో? ఆయన చూపుతోనె గ్రహించుకుంటడు.

నర్సయ్య:- మన లోపలనుంచె యెవరైన పోయి చెపితె అయిపోయె . అదెంతఘనం ? తెలియనంతవరకే ఏదైన . .

పుల్లయ్య:- నిజమే ..కాని, ఆయన జాగ్రత్తిరో ఆయన లేడంటవా ?

నర్సయ్య:- ఏదినం ఎట్లవచ్చునో ? చెప్పవస్తయ్యా ?

పుల్లయ్య:- అంతే ...కాని, మొన్న బాగచేసిండట.

నర్సయ్య:- బాగనా! ..మరి దాగనా.

పుల్లయ్య:- నిద్రలో వున్నా. .మావోరు వచ్చి చెప్పిందు నాకు .సరిగ్గా వినలేదు నేను.

నర్సయ్య:- ధర్మారంలో గవళోళ్ల దుకాణాల మీద పడి, వాళ్ళు తన్నుత, గుద్దుత, అని బెదిరించి గొంతుకదాక తాగి చావల్లో పన్నడట

పోలీసోడు. నరసింహారెడ్డి చూడు చూడు మని ఆరోజె వచ్చిండట గవళోళ్లపోయి, యిదేమి అన్యాయమయ్యా, యిట్లయితె మేము మా యిండ్లల్లనె ఉండలేము, అని ఆయనతోని మొర పెట్టుకున్నరట. నరసింహారెడ్డి ఆ అర్ధరాత్రి పోయి పండుకున్న వాణ్ణి చక్కగా కూర్చోబెట్టి వాళ్ళకు పైసలు యిస్తవా? లేదా? అని గట్టిగా అన్నడట. తెల్లముఖంవేసి, గడగడ వణుకుకుంటు అప్పటికప్పుడు యిచ్చిండట పైసలు.

పుల్లయ్య:- వాళ్ళకు యిప్పుడు చావైంది. కోళ్ళు దొరుకుతలేవు, గొర్లు దొరుకుతలేవు. ఎట్టలేము. గొట్టంలేము. ఊళ్లకుపస్తె పందలం బెట్టోదెలేడు. బజార్ల కుక్కగూడా లేస్తలేదు వాళ్ళకు.

సర్వయ్య:- మన తాలూకా నరసింహారెడ్డి మీద మండుతున్నడట. దొరికితె చంపేద్దామని చూస్తాండట.

పుల్లయ్య:- ఇక ఏముచేస్తడు మరి? తిన్న ప్రాణాలాయె ఎక్కడ ఏమి దొరకకుంట ఆయె.. ఊళ్ళమీదపడి యిష్టమున్నట్టు దోచుకొని తిని బ్రతికినోళ్ళకు యిప్పుడు నోట్లె కట్టినట్టు అయింది. జీతం రాళ్ళు ఎక్కడికయిలయి..యిక మండదుమరి?

సర్వయ్య:- కనపడితె నిలువున మింగుదామని ఉంటొచ్చు వారికి.

పుల్లయ్య:- దొరికితేనా?

సర్వయ్య:- అబ్బో! దొరికితె ఇంకెక్కడిది? మళ్ళీ మనుసులముఖం చూడనిస్తాడు? అంతమంట వున్నది వానికి.

పుల్లయ్య:- నరసింహారెడ్డికి మంచి పేరొచ్చింది. ఎవడు ఆయనను తలచుకోవడమె ...ఎవడు ఆయన సంగతి చెప్పడమె.. .ఎక్కడ విన్నా ఆయనగూర్చి వినడమె....

సర్వయ్య:- మన తాలూకా అంత ఆయనను తలవని ఊరులేదు.

పుల్లయ్య:- తాలూకా ఏంది ? దేశం అంత అనుకుంటున్నరు ఆయన పేరు. కోళ్లు పాయె. గొర్లు పాయె. దండగలు పాయె. దోషాలు పాయె. ఊరోళ్ళమీద పేరుపెట్టి చూపెనోడె లేడాయె యిప్పుడు ? యిక ఎందుకు అనుకోరు ?

నర్సయ్య:- నరసింహారెడ్డి

(యిద్దరు నైజాం పోలీసులు ప్రవేశిస్తారు.)

ఒ. పో:- నరసింహారెడ్డి ఎవడు ? వాని ముచ్చట పెట్టుకుంటున్నరు ?

నర్సయ్య:- మా తమ్ముడు.

ఒ. పో:- మీతమ్ముడా ? మీ తమ్ముని సంగతేనా ? మీ తమ్ముడు ఏడి ఎక్కడ ఉన్నడు ?

నర్సయ్య:- బస్తీకాడ ఉన్నడు.

రెం. పో:- నిజంచెప్పు. .నరసింహారెడ్డి ఎక్కడ ఉన్నడు ?

నర్సయ్య:- యిప్పుడు చెప్పేది అబద్ధమా ? మా తమ్ముడు ఎందుకు ?

ఒ. పో:- వాడు బాగ నేర్పించిను మీకు. అయితె మీ ఊళ్లోనే ఉన్నడు నరసింహారెడ్డి ?

పుల్లయ్య:- మాకు తెలియదు.

రెం. పో:- మీ యిళ్ళకు పద.

నర్సయ్య:- మే మెందుకు ?

ఒ. పో:- నడవు. పని ఉన్నది మీతోని.

నర్సయ్య:- మాకు తెలియదు.

రెం. పో:- యిళ్ళళ్లో దాచిపెట్టుతారు ? దొరకనీయి. మీరూ పోతారు వానితోని.

నర్సయ్య:- దొరికితే తీసుకపో.

ఒ. పో:- నీవు నడవాలె,

నర్సయ్య:- మాకు పనులున్నాయి (పోబోతాడు)

రెం. పో:- ఏయ్ ! నిలబడు,

నర్సయ్య:- ఎందుకు ?

రెం. పో:- నిలబడు.

నర్సయ్య:- ఏంది చెప్పు.

(నర్సయ్య నిలబడతాడు. ఒకడో పోలీసు అతనిచేయి పట్టుకుంటాడు. పుల్లయ్య జారుకుంటాడు.)

ఒ. పో:- నాతోని కచేరికి నడువు !

నర్సయ్య:- ఎందుకయ్యా ?

ఒ. పో:- నీవు నడస్తవా లేదా ?

నర్సయ్య:- ఏమి దొంగతనం చేసినా ?

ఒ. పో:- అక్కడికి పోయినంక తెలుస్తది పా.

నర్సయ్య:- ఏందో ఆనేటిది : యిక్కడ చెప్పరాదు !

రెం. పో:- మంచి బాగా బుద్ధిసెపుతా . చూస్తుండు.

నర్సయ్య:- యిక నీతోనె నేర్చుకోవాలె బుద్ధి.

ఒ. పో:- నోరు జారనియ్యకు.

నర్సయ్య:- ఏందిమరి ? నెత్తిమీదెక్కి దొంగను పట్టుకున్నట్టు పట్టుకొని, 'కచేరికి నడవు' . 'కచేరికి నడవు' . ఏమి తప్పుచేసినా ?

(యింతలో గొంగడి కొప్పెర వేసుకున్న నరసింహారెడ్డి లావాటి కర్రతో మెల్లగా వస్తాడు.)

నరసింహా:- ఏమితప్పు చేసిండు వీడు ?

రెం. పో:- ఎవరు నీవు ?

నరసింహ:- ఏమితప్పు చేసిందంటుఉంటె ?

ఒ. పో:- నీపేరు ?

నరసింహ:- నాపేరు చెపుతాకాని వీరి తప్పేమిటో చెప్పు ముందు ?

రెం. పో:- నీకేమి అక్కర ? నీవెవరవు ?

నర్సయ్య:- అమీన్ కచేరికి తీసుక పోరాదట.

నరసింహ:- నీవు చాలపూ....దొంపు !

ఒ. పో - నీవు నరసింహారెడ్డివా.. ? నీవేనా ?

నరసింహ.- నేను యిదిగో వీరిని.

(కర్రతేసి గట్టిగా వీపుమీద దెబ్బ కొడతాడు)

రెం. పో:- అరేయ్ . చంపాడు.

నరసింహ:- వారిని వదులు నీవు.

(విడుస్తాడు)

నరసింహ:- యిక మీ అమీన్ దగ్గరకు పోయి నాపేరు చెప్పు.

ఒ. పో:- నీకు యింతబలం వచ్చింది ?

నరసింహ:- కోళ్లు, గొర్రెలు తిని,

ఒ. పో:- చూస్తావు ఉండు !

నరసింహ:- వచ్చినవారిని దారివెంబడిపోక దారిని పోయేవాళ్లను ఏడ్పిస్తావు ?

రెం. పో:- మంచిది.

నరసింహ:- మాట్లాడక వెళ్ళు.

(యిద్దరూ భయపడుతూ తిరిగి, తిరిగి, చూస్తూ పోతారు.)

నర్సయ్య :- మీరు రాకపోతె ?

నరసింహ:- పట్టుకపోయి నాలుగో అయిదో వాతేసును.

నర్సయ్య:- మీ కుచ్చులే పెట్టుకుంటున్నము. మీ పేరు విని నరసింహా రెడ్డిని జూపుమంటు వచ్చిండు.

నరసింహా:- యికేమి ; చూవాడుకదా ! పోలీసులు . పోలీసులు అని ఎగ బోసుకుంటు ఉరికి వచ్చిండు ఖావగ్గరికి ఫుల్లయ్య. నేను ఏమిటో అనుకున్న !

నర్సయ్య :- మిమ్మల్ని గుర్తుపట్టాడు.

నరసింహా:- పట్టనీయి ఏం భయం ?

నర్సయ్య:- మనం యిక్కడ ఉందవద్దు.

నరసింహా:- యికేమి పని :

*(వాళ్ళిద్దరూ పోతారు. మరికాసేపటికి పారిపోయిన యిద్దరు పోలీసులు భయపడుతూ బెదిరిచూస్తూ ప్రవేసిస్తారు)*

ఒ. పో:- నా టీటుయిక్క పోయింది.

రెం. పో: నా నడుం బిళ్ళ లేదు.

ఒ. పో:- యిక్కడే పోయింది అది.

రెం. పో:- *(యిద్దరూ క్రిందికివంగి వెదుకుతుంటారు)* ఏందరో మెడమీదినుంచి జారింది... నేను కనిపెట్టలేదు.

ఒ. పో:- గొంగడివాడు నరసింహారెడ్డి.

రెం. పో:- లేకపోతె యింకొనికి యింతబలం ఎక్కడిది ?

ఒ. పో:- వాణ్ణి పట్టుకోకపోతె మనపని ఉత్తదే.

రెం. పో:- ఊళ్ళలో మనం తిరగలేము యిక.

ఒ. పో:- ఉండు ఏమిచేస్తానో చూడు. పట్వారిని రమ్మంటే రాలేమ చూడు.

రెం. పో:- ఎల్కొడు చెప్పిండో లేదో! అయినా యిక్కడికి వద్దు. కచేరికి పిలిపించుకుందాము.

ఒ. పో.- (సంచివెతికి) డీయిబుక్కు యిదిగో.

రెం. పో:- (సంచులు చూచుకొని) నాబిళ్ళ యిదేంది !

(ఇద్దరూ నిష్క్రమిస్తారు)

## రెండో రంగం

ఊరుచావిడి. అర్థరాత్రివేళ.

(లాంతరు ఒకటి వెలుగుతూ ఉంటుంది. అమీన్ మంచంపై కూర్చొని కునికిపాట్లుపడుతు, అప్పుడప్పుడు ఎవరికోసమో ఎదురు చూస్తుంటాడు. మంచంపైన తూటాలునింపిన పిస్తోలు ఉంటుంది.)

అమీన్.- పిళ్లపోయి చాలసేపైంది. యింకా రాలేదు. ఏమి కావచ్చు! పట్వారీ 'ఉన్నాదయ్యా. తప్పక ఉన్నాడు దొరకకపోడు' అని ఒట్లన్ని వేసుకున్నాడు. పట్వారి ఏమైన చేయలేదుకదా! ఎవణ్ణీ నమ్మటానికిలేదు. కాలం అంతా మారిపోయింది. పైకి 'హుజూరు హుజూరు' అని అన్నా లోపల పూర్వపు భయ భక్తులు ఒక్కరికీ లేవు. ఏమిటి పిళ్ళై నేనుపోతే యింత సేపు పట్టేదా? పట్వారి స్వంతమనుషుల సిఫారసుచేసినని చెప్పినాడు. ఏమి చేసిండో! నిశ్చయము? ఈ పిదిలక అంతా వాడు ఏ కన్నంగుండానో కనిపెట్టి ఉడాయించిండేమో! పిళ్ళ తెలుపులు యింటే

(ఇంతలో తెరలో ఉద్రేకంగా మాట్లాడుకుంటున్న మనుషుల చప్పుడు వినబడుతుంది. ఆ చప్పుడు విని అమీన్ పిస్తోలుతీసుకొని లేచి ఆ ధ్వని ఏమిటో కుతూహలంగా వింటూ అటుయిటు తిరుగుతుంటాడు. చప్పుడు మరింత దగ్గరైతుంది. యింతలో నరసింహారెడ్డిని గట్టిగా తాళ్ళుపోసి ఆ ఇద్దరు పోలీసులు పట్టుకొని వస్తారు.)

అమీన్.- పట్టుకున్నారు! సాబాస్! నాకు నమ్మికలేకుండె మీరు పట్టుకుంటారని' చాల గొప్పపని చేసిన్రు. తీసుకరాండి యిటు.

ఒ. పో. దొరకక ఏమి చేస్తడు ! యిటువంటోళ్ళు లక్షలు అయింద్రు. వీడు లెక్క !

అమీన్:- మంచిపని అయింది, మంచిపని అయింది.

రెం. పో:- మా ప్రాణాల తిన్నడు.

అమీన్.- ప్రాణాలతిన్నాడు ? ఏమిరా ! వాడి ప్రాణాల మనం తిందాము.

రెం పో.- చేతికొచ్చేవరకు ఏమైతదనో భయం ఉండె. తుపాకి గురి చూపకపోతె పారిపోయెటోడె.

అమీన్.- యిటు పట్టుకరంతె, ఏమి, పోలీసులంటే నీకు పరవాలేదుకదు?
(నరసింహారెడ్డి మాట్లాడడు. గంభీరంగా నిలబడి ఉంటాడు.)

అమీన్.- ఒక తన్నుతన్నరా ?

ఒ. పో:- పొరకంగనె పిసిచినాను పల్లంతా మెదిగింది దాగా .

రెం. పో.- ఆరోజు మామిద తిరగబడింది తప్పక వీడే.

అమీన్ - ఎవడిరా ?

నరసింహారెడ్డి - నాకు తెలియదు.

అమీన్.- నీవు తప్ప ఈ తాలూకాలో మరొకడికి దమ్ములేదు. నీవో, నీ పార్టీలో వాడో. .

నరసింహా:- నాకు తెలియదు.

అమీన్:- పోలీసువాళ్ళ గుండెల్లో నిదుర పోతావేమొకదా ! చెప్పరా ?

నరసింహా:- నేను అనలేదు.

అమీన్ - నీవు అనలేదు ? నీవు ఏమి చేయలేదు ? వీణ్ణికొట్టింది ఎవడు?

నరసింహా:- నాకదేమి తెలియదు.

అమీన్.- అరేయి .పీరి నాయిక గుంజరా . .

ఒ. పో:- అరేయి చెప్పు, పల్లు పగులుతది.

అమీన్:- పోలీసులంటె గడ్డిపరక అయిపోయింది.

ఒ. పో:- ధర్మారం చావడిలో బీటుజవాన్ నిదురపోతె పడియుండిని తీసి
    కొనివచ్చి తన్నిపోరాదు ?

అమీన్.- నీవేనారా ?

నరసింహా - నాకు తెలియని సంగతి నేనేమి చెప్పను ?

అమీన్:- నీకు తెలియదు ? మాటలతోని చెబుతావు ? అరె ! హమీద్ !

(ఒకరిద్దరు కానిస్టేబిలు చేతికర్రతో మోకాళ్ళపైన గట్టిగా కొడతారు)

నరసిం:- అవ్వా అవ్వా

అమీన్:- అవ్వా ! యింకోటి తన్ను.

ఒ. పో.- అప్పటికన్నా దగా అయింది చెప్పు ? ఒప్పగపోడు యిది .
    ఏమో అనుకున్నావు !

(ఇంకొకటి కొడతాడు)

రెం. పో:- దెబ్బలతో చచ్చిపోతవు. చెప్పు.

నరసింహా.- నా కేమి తెలియదు.

అమీన్:- అరేయ్! వీనికి అట్లాకాదు. యింకా కొట్టారె

ఒ. పో:- మా దెబ్బలకు భూతాలు మూడుస్తయి. నీ కేందిరా? యిదిగో
    చూడు నీవు ఎట్లా చెప్పవో

(గట్టిగా కొడతాడు)

నరసింహా.- చంపండి మీ యిష్టం.

రెం. పో.- చెప్పేదాకా విడవం చచ్చిపోతవు.

నరసింహా.- చంపండి నాకేమి తెలియదు.

ఒ. పో:- ఏమి తెలియదు?

నరసింహా:- తెలియదు.

అమీన్:- తెలియదురా?

(బూటుకాలుతో కడుపుమీద తంతాడు)

నరసింహా.- (వెల్లకిలంబడి) అవ్వా! అవ్వా! నొప్పి .

(బాధతో కళ్ళు మూస్తాడు)

ఒ. పో.- చెప్పు యిక! చచ్చిపోతవు!

అమీన్ - చస్తేచచ్చె! పోలీసువాళ్ళమీద తిరగబడి చచ్చిపోయిండని పంచనామా చేస్తా!

(నరసింహారెడ్డి కడుపుమీద రెండు చేతులు పెట్టి బాధపడుతుంటాడు)

ఒ. పో.- అరె! రే! ప్రాణం పోతేమ.

రెం. పో - మొండి రాక్షసులు. వీళ్ళు చావరు.

అమీన్.- కనపడగనె గోలివేయమంటిరి.

ఒ. పో.- గుడిసెలో పండుకున్నడు మా అడుగుల చప్పుడు విని తెలివి వచ్చిందేమొ తొంగవ పట్టింది. ఎటు పోయిన లాభం లేదనుకొని ఒక ఎత్తు వేసిండు యిక. తలుపు తోయంగనె బయటపడుదామని మెల్లగ గొళ్ళెంతీసి తెలివిగా పోయి దర్వాజా మూలకు నక్కిండు. నేను యిదంతా చూడక తలుపు తోసుకొని లోపలికి పోయినా. నా వెనక యింకోడు ఉన్నడు ఇద్దరము లోపలికె రాంగనే యిక అయిపోయింది అనుకున్నడు. దబ్బున లేచి ఉరికపోయిండు. దర్వాజాలో అడుగుపెడుతున్న పట్వారిని చూడలేదు వానికి పోయి గట్టిగా తాకిండు పట్వారి అట్లనే పట్టుకున్నడు. యిక విడవలే. యిద్దరు బాగ కలియబడ్డరు. పట్వారిని కిందపడేసి బయటపడేటోడె. యింతలో నేను ఉరికి 'కదిలితే కాలుస్త' నని తుపాకి చూపెట్టినా యిక అట్లనే చచ్చినోని తీరు భూమికి వంగిండు.

అమీన్:- ఉడాయించను ఎరి.

ఒ. పో:- పట్వారి, వీడు కలెబడ్డరు. లేకుంటే అయ్యేదే.

అమీన్:- వీడు పోతే ఈ తాలూకా మొత్తం లొల్లి లేకుండ అయితది.

రెం. పో:- బాగా నేర్పిండు రైతులకు. కోడి యివ్వకు, గుడ్డు యివ్వకు, మూటలు మోయకు, ఎట్టి చేయకు, యిది పారం అయిపోయింది అందరికీ.,

(నరసింహారెడ్డి బాధపడుతుంటాడు)

ఒ. పో-- అరేయి! యింకేమైంది లే.

అమీన్:- తిన్ను ఒకటి. సహం చక్కగా అయిపది

రెం. పో:- రైతులంతా వీని పాట బాగా నేర్చిండ్రు. మొన్న గణేశపురంలో సాకలదాన్ని మూటకు పిమ్మంటే 'పైసలు తే వస్త' నన్నది. మూతిపండ్లు విరగకొట్టినా.

రెం. పో:- రాంపురంలో ఏమి చేసిండు? వెంకటాపురం నుంచి కోళ్లు తెచ్చి చావట్లోపెట్టి ఊళ్ళోకి పోయినా. వచ్చేవరకు కోళ్ళన్నీ విడిచిపెట్టించిండు. వీడు తప్ప మరొడు కాదు.

ఒ. పో:- తాలూకా మొత్తం పాడుచేసిండు. మునుపు కానిస్టేబులు అంటే ఊరంత యట్ల భయపడేది! యిప్పుడు బాట పోయే ఆడదికూడ రాచుకపోతది.

అమీన్:- చంపేయండి వెధవను.

(నరసింహారెడ్డి గోడకు ఆనుకుని వాలిన కడుపు పట్టుకొని బాధ పడుతుంటాడు)

ఒ. పో:- బాగ తగిలింది వెధవకు.

అమీన్:- బూటు దెబ్బ! రూడించి తన్నినా.

ఒ. పో:- అరేయ్! ప్రాణం పోదులే.

రెం. పో:- యిట్లా చెప్పడు వీడు. కళ్ళలో కారం పెట్టారె.

అమీన్:- మంచి మందురా. పట్వారి యింటికిపో.

(రెండో పోలీసు పోతాడు)

ఒ. పో:- అరె చెప్పు. పల్లంతా పగలగొట్టుకోకు.

అమీన్:- ఒక్క తన్నుతో యేమైంది? క్షణం నిలబడు నీవే చెపుతవు.

ఒ. పో - వీని కొకనికి బుద్ధివస్తేగాని, పోలీసు అంటే ..మళ్ళీ భయ భక్తులు యేర్పడవు.

అమీన్.- పోలీసు అంటే ఏమటేమ. పిల్లలాట ఐపోయింది.

(రెండో పోలీసు వస్తాడు)

ఒ పో:- హు యిక పంట్లు తెప్పురా.

(నరసింహారెడ్డి లినబొంత వాను పటుపడుతాడు.)

ఒ. పో.- నీవెక్కడ చస్తవు? కంట్లు తెరువు.

(ఒకటో కానిస్టేబులు నరసింహారెడ్డి కళ్ళు బలవంతంగా తెరిపిస్తాడు. రెండో కానిస్టేబులు కళ్ళలో కారం కుక్కుతాడు.)

నరసిం:- అవ్వా. కళ్లు పాయె.

అమీన్.- చాపు .యిక చెప్పు. నీవు ఎవన్నెవణ్ణి కొట్టింది.

నరసింహా·- నాకేమి తెలియదు.

అమీన్:- లేకపోతె ఆ కొట్టిన వానిపేరు చెప్పు.

నరసింహా:- అవ్వా! ఎవరైంది నాకు తెలియనే తెలియదు.

అమీన్:- ఇక నీవే చెపుతవు.

నరసింహా:- అబ్బా! కళ్ళు భగ్గుమంటున్నయి.

రెం. పో:- ఇంకా అంటఛ్.

నరసింహా:- కళ్ళు కనబడట్లం లేదు.

ఒ. పో:- బాగ కనపడతయ్ యిక.

నరసింహా:- అయ్యో .అయ్యో .కళ్ళు మాడిపోతున్నయ్.

ఒ. పో:- మాడిపోనియ్. మసి కానియ్.

నరసింహా:- అయ్యో! . అయ్యో!....

రెం. పో:- ఏడ్వు.

నరసింహా:- కండ్లు. . కండ్లు.

రెం. పో:- ఎక్కడికీ పోవు.

నరసింహా:- కడ్లు ..కండ్లు . నిప్పులు పోసినట్టు మండుతున్నయ్.

రెం. పో:- ఏమనుకున్నవు?

నరసింహా.- అయ్యో మంట. .మంట

ఒ. పో:- తెరువు ..మళ్ళి ఒకసారి పెడతా.

నరసింహా:- అయ్యో .అయ్యో

(అటు యిటు చూడటానికి ప్రయత్నిస్తాడు.)

అమీన్:- ఇప్పుడైన చెప్పు. నీవు కాకపోతే యెవడో వాని పేరు.

నరసింహా:- ఎవడైంది నాకు తెలియదు.

అమీన్:- అరేయ్ ..నిన్ను వదిలేస్తాము వానిపేరు చెప్పు.

నరసింహా:- అబ్బో! నాకెవడూ తెలియదు, నిప్పులు కురుస్తున్నయి.

ఒ. పో:- ఈ రాత్రి పీట్టే యిక్కణ్ణుంచి తీసుకుపోవలె.

అమీన్:- ఊ ...ఊ.... తెల్లవారితే లాభంలేదు.

రెం. పో:— నడిచేనా? వల్లంత మెదిగింది.

అమీన్:— తన్నండి .వీడు మనదగ్గర- వద్దు. . భూతం। తెల్లవారక ముందే ఊరు దాటించాలె.

ఒ. పో:— అపును తెల్లవారకముందే ఊరు దాటంచాలె.

రెం. పో:— రిమాండు చేయించాలె?

అమీన్:— నాపేరు చెప్పండి. ఒంటరి గంజ్‌లో వేయమనండి.

రెం. పో:— గోడనుంచి కదులుతలేదు. నడిపించేనా?

అమీన్:— గుంజుక పోండి, లాఠీపుందా?

ఒ. పో:— అరే। నడపు యిక.

(రెండో పోలీసు చేయలను సంకెళ్ళు వేస్తాడు.)

అమీన్:— సరిగా పడ్డాయో లేదో జూసుకోండి।

ఒ. పో.— (కళ్ళు చూస్తాడు) ఇక ఎక్కడికి పోతాడు?

అమీన్:— ఇదిగో కాగితం . భద్రం మరి

ఒ. పో. - వాని నెక్కడ విడిచి పెడతాము. శవాన్ని అయినా గుంజుకు పోతాము.

అమీన్:— అంతే.

ఒ. పో: - నడుపు.

(నరసింహారెడ్డి నొప్పితో నీరసంగా నడుస్తాడు)

## మూడో రంగం

(నరసింహారెడ్డి చేతులకు కళ్ళువుంటాయి. బాధతో నీరసంగా నడుస్తు వుంటాడు. పోలీసులు నరసింహారెడ్డిపైన విసుగుకుంటూ వుంటారు.)

ఒ. పో:— అరేయ్। యింకా ఆరుమైళ్ళు నడవాలె.

నరసింహా:— నా చేతనైనంత నడుస్తున్నా.

రెం. పో:— యిక్కడె రెండుజాములైంది. వీడు ఈ రోజు వుపాసం పండపెడుతడు.

ఒ. పో:— ఉపాసం, మనకేంది? రాంపురంలో మంచిగా పకేలును పిలి పెంచి

రెం. పో:— ఏమన్నా ఉన్నాయ్ జేబులో?

ఒ. పో:— ఏమన్నా ఉంటే సరే, లేకపోతె ఈ రోజు నీకు ఏకాదశి.

నరసింహా:— నావొళ్లు తిరుగుతుంది కొంచెం కూర్చుంటా.

రెం. పో.— తిండి అనేపటికి వీనికి చేతకాకుండా అయింది.

నరసింహా:— నా కేమి కనబడటంలేదు ప్రాణం చుట్టుకపోతుంది, నేను నడవలేను.

(కూర్చుంటారు)

ఒ. పో:— అరే, నువ్వు చావక్లో పండుకుంటున్నవు పా.

రెం. పో:— అదేమిటి, ఊరు!

నరసింహా:— ఏమన్నా లిసంబి నాచేతకాదు నడవను.

(నేలమీద పడుకుంటారు.)

ఒ. పో.— అరె పా ఊళ్లోకి ఇక్కడేమున్నది?

(కదలడు)

రెం. పో— ఊరుదగ్గరికివచ్చి కూచుంటావా?

(తలవంచుకొని అట్లాగే కూర్చుంటాడు.)

ఒ. పో.— అడవిలో ఏమి దొరుకుతది? ఊళ్లోకిపోయినంక అడుగు. అప్పుడు .

(మాట్లాడడు)

రెం. పో: - కోపుటియింట్లో ఏమున్నతిందువు పా.

ఒ. పో. - లే .

(నరసింహారెడ్డి కడాలలు పట్టుకొని బాధపడుటూ లేస్తాడు. అంతా ఒక వైపున లోపలికివెళ్ళి రెండోవైపున ప్రవేశిస్తారు. నర్సింహారెడ్డి గోడకు చేర గిలబడతాడు. పోలీసు ఎలవాణ్ణి కూతలువేస్తాడు. ఎలవాడు ఉరికి వస్తాడు. ఎలవాడు క్షణంలోపోయి పోలీసువాళ్ళు వండుకోడానికి బియ్యం, ఉప్పు, చింతపండు మిరపకాయలు, కొతిసిపాలు తెస్తాడు. నర్సింహారెడ్డి పాలుతాగి కొంచెం తెప్పరిల్లుతాడు.)

ఒ. పో: - (రెండో పోలీసుతో) అన్నం తొందరగా కానీయ్. యిక్కడ్నే చీకటి అయితది.

రెం. పో. - (నరసింహారెడ్డితో) అన్నం. అన్నం. అని చస్తూం టివి. ఈ ధనియాలు కొంచెం నూరు, అట్లనే అల్లం. మిరప కాయలు.

నరసింహా. - మంచిది.

రెం. పో అరేయి . మరిచినా, ఎలోడూ! కోడి తీసక రారా!

ఎలవాడు: - అయ్యా . దొరుకుతది.

ఒ. పో: - హత్ ఉరుకు.

రెం. పో: - అల్లం దాగానూరు.

(నరసింహారెడ్డి నూరిపోతాడు. కాని సంకెళ్ళు అడ్డం రావటంవలన నూరరాదు.)

నరసింహా. - పీలుకావటంలేదు.

ఒ. పో - కప్పు తీసెయ్! యిప్పుడు పోతాడూ! అయిన శాస్తి చాలదూ!

(రెండోపోలీసు తీస్తాడు)

రెం. పో:- యిక నూరు. ఎట్లా ఉండాలె? మెత్తగా.

నరసింహా:- నూరుత.

(తలవంచుకొని నూరుతుంటాడు.)

రెం. పో:- వీడికి అన్నీ వచ్చు.

ఒ. పో - రానిదే అడవులపొంటి తిరుగుతాడు!

రెం. పో:- అల్లం అయిందా?

నరసింహా:- అయిపోయింది.

ఒ. పో:- ఎల్లిపాయ.

నరసింహా:- అయింది.

రెం. పో:- మిరపకాయలు?

నరసింహా:- నూరుతున్నా.

ఒ. పో:- మెత్తగా పిండిమాదిరి....మాంసం కూర మరి!

నరసింహా:- నూరుతా . .

(నరసింహారెడ్డి కళ్లలో నూరుతున్న పొడుం పడుతుంది, ఆ మంటలో ఏదో ఆలోచన స్ఫురిస్తుంది. ఆలోచిస్తూ కళ్ళు నలుముకుంటాడు.)

ఒ. పో:- మళ్ళీపడ్డది కారం?

నరసింహా:- పరవాలేదు - పోయింది.

ఒ. పో:- మెత్తగా నూరు-తొందరపడకు.

నరసింహా:- మెత్తగానే నూరుత.

రెం. పో:- నాకు చూపాలె.

నరసింహా:- చూపుత.

రెం. పో:- ఎలవాడు రాలేదు చూడు.

ఒ. పో:- కోడిదొరకవద్దూ.

రెం. పో:- అరె! మళ్ళీ యిటువంటి తిండి దొరకదు. (మొదటి పోలీసుతో) నువుపోయి ఎలవాడిని తీస్కరాపో.

ఒ. పో:- జైల్లో పడ్డంక యింకనా?

రెం. పో:- జైల్లో జొన్నరొట్టె, చింతపులుసు.

నరసింహా:- కారం అయింది తీయనా!

రెం. పో:- యిటుచూపు, ఎట్లా నూరినవో.

(నరసింహారెడ్డి ఉత్సాహంగా రెండు దోసిళ్ళ కారం వాళ్ళ మధ్యకు తీసుకుపోతాడు. రెండో పోలీసు వేలుపెట్టి దానిని పరీక్షిస్తుంటాడు. నరసింహారెడ్డి అకస్మాత్తుగా ఆ కారాన్ని అతని కళ్ళలో గుప్పి ఒక్క గంతులో బయట పడతాడు.)

రెం. పో - అబ్బా! ఉరికె, ఉరికె, అబ్బా! కళ్లు పాయె ..ఎట్లా ?

(కళ్ళు నలుముకుంటూ లేచి బాధపడుతుంటాడు.)

రెం. పో:- యిక దొరకదు మంట ...మంట.

(భయపడుతూ ఎలవాడు మొదటి పోలీసుతో ప్రవేశిస్తాడు.)

ఎల:- అయ్యా! కోడి దొరకలే, గుడ్లు తెచ్చినా.

రెం. పో:- నెత్తిన కొట్టుకో. గుడ్లు మండిపోయె.

ఎల:- అయ్యా! అదేంది? ఏమాయె?

రెం. పో:- అరె! ఉరుకు, ఉరుకు. వాడు పోయె.

ఎల:- ఎవరయ్యా?

ఒ. పో:- ఎవరయ్యా! అరె! వాడు! పట్టుకో పో.

ఎల:- అయ్యో! ఏమాయె? ఎటుపాయె?

ఒ. పో:- ఉరుకురా.

ఎల:- ఎటు?

ఒ. పో:- ఉరుకురా! అబ్బా! కళ్ళు చితికిపోతున్నయ్.

రెం. పో:- కండ్లల్లో కారం పెట్టిండా?

ఎల:- అయ్యో! కారం అంతా చల్లిండు.

ఒ. పో:- అరె! ఉరుకుతావా? లేదా?

ఎల:- ఎటు ఉరుకా?

ఒ. పో:- వాట పొంటె ఉరుకు. మంట అబ్బా!

ఎల:- ఎంత దూరం పోయెనో? అయ్యో! పోతున్నా . యిపుగో గుడ్లు.

ఒ. పో:- ఆడ పారేయ్! గుడ్లు! అరె! మంట! మంట!

రెం. పో:- నా తల తిరుగుతుంది. అబ్బా!

ఒ. పో:- కారం బాగ మండుతది!

రెం. పో:- అవును . మండదుమరి. వాడు దొరుకుతడా?

ఒ. పో:- అబ్బా!

రెం. పో:- హా! వాని తెలివి చూడు.

ఒ. పో:- తెలివా? తెలివా? చెప్పే తెలివి కాదు.

రెం. పో:- అందుకే సర్కారుకు——

ఒ. పో:- భయం——భయం——వీళ్ళంటేనే భయం. కారం ఇంత మంట ఉంటదని- హూ! నేనూ అనుకోలె.

రెం. పో:- యిక దొరకడు వాడు.

ఒ. పో:- మనకి డబుల్ గంజ్ ఖాయం.

రెం. పో:- మంట! మంట!

(ఇద్దరు తలలు పట్టుకొని కూర్చుని ఉంటారు.)

[తెర]

# ఏమి సస్యలు



రచయిత :

శ్రీ పోతుకూచి సాంబశివరావు

జననం : 1929

నివాసం : హైద్రాబాదు

అభిరుచి : నాటకరంగం.

రచనలు : ముద్రితం : 1. ప్రతిధ్వనులు. (శ్రవ్య నాటికల సంపుటి)

2. ఇదీ వంతు. (వ్యంగ్యహాస్య నాటిక)

వివిధ పత్రికలలో కథానికలు.

అభిమానరచయిత : బెర్నార్డ్‌షా.

ప్రభుత్వోద్యోగములో ఉన్నారు.

పాత్రలు

భవం

ఘరం

ఇహాం

పరం

శూన్యం

శవం

శివం

# ఏడు సున్నాలు

## ఒకటో రంగం

(పార్కు సీను. స్టేజికి చుట్టూ పూల కుండీలు వుంటాయి.)

మదం - (ప్రవేశిస్తూ) ఆహాహా! ఏం గాలి! ఏం గాలి! ఒరేగాలి! హృదయ పులకిత మలయ మారుతము! నా జుట్టు రింగులు నృత్యంజేయించే పిల్లగాలి! యిటువంటి పిల్లగాలులు అనుభవించడానికే గాబోలు అందరూ సాయంత్రం పార్కులకు వస్తారు. (ముక్కునిండా గాలి పీల్చి) ఆహాహా! ఏం! ఘుమ ఘుమ! అసలు పిల్లగాలిలోనే ఘుమ ఘుమ వున్నాయి. దానికితోడు యీ పార్కులోని పూల వాసనలు! వచ్చే వెళ్ళే వాళ్ళ సెంటుపూతలు!! యింక చెప్పేదేముంది! అసలే కవిని. యింక యిటువంటి ఘుమ ఘుమ సంపర్కంలో కవిత్వం రాకపోతుందీ!

1. గాలిలో గాలి
గాలిమీద గాలి
బహు పిల్లగాలి
అతి చల్లగాలి
మా మంచిగాలి - గాలి!

2. గాలిలోని
సౌరభాలు
కదిలించి
చూచాయి
నా హృదయ
తంత్రులను!

ఒరేగాలి! చక్కటి పిల్లగాలి! ఆహాహా! ఏంగాలి

(అంటూ చిన్న యుత్సాహంలో వుంటాడు)

**భారం.**— (దూరాన్నుంచి కర్నాటక గీతం రేడియోద్వారా వినిపిస్తూ ఉంటుంది. తాళంవేస్తూ ప్రవేశం) సస రిరి గగ మమ

స రి గ మ ప ద ని స

తకిట తకిట తద్దికిట దికిట

కిటతోం కిటతోం తద్దికట.

(పాట ఆగిపోయింది.)

ఏమిటీ పనికిమాలిన రేడియోలు. మధ్యలో గబుక్కున ఆగిపోతాయి. ఇటువంటి రేడియోలు పార్కుల్లో వుంటే మనం పాటలు విని ఆనందించినట్లే! పాడేవాడి గొంతుక పాడైందో తెలియదు. లేక రేడియో వగులబడిందో తెలియదు!! అసలు నేను ఏ పాట సాధన చేయడం మొదలుపెట్టినా, అది సగంలో ఆగిపోవడం పరిపాటై పోయింది. అయినా పాటలేకపోతే తాళం సాధన మానమని ఎవరు చెప్పారు! తకిట, తకిట (అంటూ తాళం వేస్తూ తన్మయత్వంలో ఉంటాడు.)

**ఇహ్హాల** - (చెయ్యిచూసుకుంటూ ప్రవేశం) ఈ పరీక్ష ఇలా పోతుందనుకోలేదు. ఎక్కడికీ సూర్యరేఖ విజృంభిస్తూనే వుంది. ఈ రేఖ బాగుంటే విద్య బాగా వస్తుందంటారు. మరి నా పరీక్ష పోవడానికి కారణం. నా స్నేహితుల్లో చాలా మందికి వాళ్ళ పరీక్షలు పోతాయని జ్యోతిషం చెప్పాను. నేను అలా చెప్పిన వాళ్ళందరి పరీక్షలు పోయి నా జ్యోతిషం అక్షరాలా ఫలించింది. కాని నా పరీక్ష ప్యాసవుతుందనుకుంటూంటే. ఇలా పోవడ మేమిటి? .. అయినా ఆయుష్షు చేతిరేఖలు బాగా కనిపించటం లేదు. అస్తమానం నాటకాల్లో కోటా కొడుతూంటే, ఆ రంగులు ఈ రేఖల్లో మారి, కొన్ని రేఖలను కనిపించకుండా మాయం చెయ్యవచ్చు. అసలు ఈ జ్యోతిషమే క్లిష్ట సమస్య! ఉత్త జ్యోతిషం మీదే ఆధారపడి ఊరుకోవడంవల్ల, నా పరీక్షపోయి, మరీ క్లిష్ట సమస్య వచ్చిపడింది!! అయినా నా పరీక్ష ఎందుకు పోయిందో. (చెయ్యి తీవ్రంగా పరిశీలిస్తూ ఉంటాడు.)

శూన్యం.— నా పేరు మా వాళ్లు తూచి తూచి పెట్టారు లేకపోతే నా పరీక్ష యిన్నిసార్లు పోవడమేమిటి? నాకు ఎక్కడా లేని వైరాగ్యం వస్తోంది. చుట్టుపక్కల అంతా శూన్యంగా ఉంది. నా భావి శూన్యంలా కనపడుతోంది. జగత్తంతా నాకు శూన్యమనిపిస్తోంది. అసలు నా బ్రతుకే శూన్యమైపోయింది అందుకే నా పేరు శూన్యం అన్నారు (అంటూ దిగాలుగా ఒక మూల కొంచెం ఏడుస్తుంటాడు.)

పవనం:— (ఒక భుజాన కెమేరా, మరొక చేత్తో పుస్తకాలు, నోటుబుక్కు, ఫెల్టు హాట్ ప్రవేశిస్తూ). ఏమిట్రోయి ధనం! గాలి గాలి అంటున్నావు ఏమన్నా గాలి పట్టిందా ఏమిటి? . యిదిగో మన ఖాళీ కూడా యిక్కడే వున్నాడు. వీడేదో పాట సాధన చేస్తున్నట్టున్నాడే! ఏమిరోయి! ఎవరున్నవీ మనిలే పార్కుల్లో కూడా నీకీ పాట సాధన తప్పలేదా? ఇదిగో! మన ఇహం కూడా యిక్కడే వున్నాడు. వీడికేదో రోగం! ఎప్పుడూ చెయ్యి మూసి కొడమే వీడిపని. లేకపోతే యింకొకడి చెయ్యి పట్టుకుని వదిలిపెట్టడు. ఓహో! మన శూన్యం కూడా చేరాడు! బాగుంది. ఏమిట్రా! ఒకళ్ళతో ఒకళ్లు మాట్లాడుకోకుండా తపస్సు చేస్తున్నారేమిటీ యీ పార్కులో!

ధనం: - యీ చల్లగాలి చూసేటప్పటికి కవిత్వం వ్రాయ బుద్ధిపుట్టిందిరా! తీవ్రంగా కవిత్వం ఆలోచిస్తున్నా. ఒక గేయమల్లేనోయి! (గాలిలో [illegible] పాడుతాడు.)

[illegible] - భేష్! పాట బాగుంది ధనం! అయితే మన పరీక్ష ఫలితాలు వచ్చాయిరా! గీత ఏమయింది?

ధనం.— ఒరే! కవులు ఎక్కడైనా పరీక్షలు ప్యాసవుతారా! అసలు నిజమైన కవి ఎప్పుడూ పరీక్ష ప్యాసవడనుకో! వాడెప్పుడూ కనివిని ఎరుగని విషయాలు గురించి ఊహించి ప్రజలకు తెలియజేస్తాడు ప్రపంచంలో వున్న విషయాలు వాటి కక్కర్లేదు నేనే పెద్ద పెద్ద గ్రంథాలు వ్రాసే శక్తిగలిగి వున్నప్పుడు. యిలా

రులు వ్రాసిన గ్రంథాలు చదివి పరీక్షలు ప్యాసవడమెందుకు ? అనిపిస్తోంది ఏదో కాస్తా కూస్తో డబ్బు వుంది. ఉద్యోగం చెయ్యక్కరలేదు. ఇలాగే, కవిత్వసేవచేస్తూ జీవితం కాలక్షేపం చేసేస్తాను.

[redacted]:— అయితే ఇహం ! నువ్వు పరీక్ష ప్యాసయినట్లేపో !

ఇహం:— అదేరా ! చెయ్యి చూసుకుంటున్నాను. యిప్పుడు పోయిన పరీక్షకేం చెయ్యలేంగాని ముందు ముందు ఎంత త్వరిలో పరీక్ష ప్యాసవగలనో అని ఆలోచిస్తున్నాను.

పరం:— యింక మన శూన్యం, ఖాళిం, పరీక్షయి ప్యాసవరని ఢంకా బజాయించి చెప్పవచ్చును.

శూన్యం:— నీ ఊహ అబద్ధం కాదనుకో. నా కంతా శూన్యంలా కనిపిస్తోందిరా యీ పరీక్షపోవడంవల్ల.

పరం:— నీకది అలవాటేగా !

ఖాళిం:— పోనీలెద్దూ ! ఎందుకూ ఉపయోగంలేని పరీక్షలు ! యివి మనల్ని ఉద్ధరిస్తాయి కనుకనా ! ఎం. ఏ.,లు ప్యాసయి గుమాస్తా గిరీలు చేస్తూ ఎంతమంది నానా అవస్థలు పడటంలేదు. యింక మనం పరీక్షలు ప్యాసయి బావుకునేదేమిటి ?. . నాకు కొంచెం సంగీతం వచ్చుగా? యీ గానకళ పోషించుకుంటూ జీవితం గడపాలని ఉంది నాకు. . . సినీమాల్లో పాటలు పాడి ఎంతమంది డబ్బు సంపాదించటంలేదు ! ఖర్మం ! ఒక్క సినీమా ఛాన్సు దొరికితే సరి యింక యీ పరీక్షల మొహం ఎవరు చూస్తారోయి !

భవం.— అయితే పరం ! నీ సంగతి?

పరం:— మ స్నేహబృందంలో ముఖ్యుణ్ణి కదా ! నేను ప్యాసవుతే మన బృందానికి అవమానం కదుటోయి అందుచేత నేనూ ఫేలయి పోయాను.... అయినా యిష్టంకాని పాఠాలు చదివితే ఏంవస్తుంది

అనుకోవద్దు. కొంచెమైనా విశ్రాంతి లేకుండా రాత్రింబవళ్ళు టీలు త్రాగి, మేల్కొని, దగ్గు తెచ్చుకుని ఆయాసపడి పరీక్షల ముందు పుస్తకాలన్నీ చదవలేదట్రా ?. . మన పరీక్షల ముందు మా వూరినుంచి మా వెంకయ్య వచ్చాడుట. వచ్చి నా విషయాలు అన్నీ వాకబుచేసి ఉన్నవీ లేనివీ అన్నీ కలిపి పితూరీలు చెప్పాడుట.

పరం :— ఎవడురా ! ఆ వెంకయ్య ! వాడిని పేపరులో పెట్టి ఏకేసి వదిలి పెడతాను.

శవం :— ఉన్నాడులే మానాన్నకి ఒక ప్రాణస్నేహితుడు. వెంకయ్య ముందు ఆనాడే ప్రతిజ్ఞ పట్టాడుట మానాన్న : నా పరీక్ష పోతే యింట్లోంచి వెళ్ళగొడతానని.

భపం .— అయితే తకిట, దికిట, తద్దికిట, అని దపదదాజాయకూడా చేశాడా మీ నాన్న.

శపం .— అవిమాత్రం తప్పుతాయి !

భపం :— నీకష్టం చూస్తూంటే దుఃఖసంతోషాతిశయంకపిర్వం వస్తోందిరా !

శవం :— పైగా రెండేళ్ళకు ప్రత్యేకం నాయిగుపేరు ఖర్చు పెట్టాడుట నాకోసం మా నాన్న. అసలే మా నాన్న పీనాశి. యీలోకుప చూసి మా సవతి తల్లి " డబ్బంతా తగలెట్టాడు. యిపేం చదువులు బాబూ." అంటూ సూటీ పోటీ మాటలు చెప్పి మా నాన్నకు మరీ కోపం తెప్పించింది. ఇంతకీ అడబ్బు అనవసంగా పరాయి వాళ్ళకు ఖర్చు పెట్టాను కనుకనా ! స్నేహితులు కాబట్టి మీకందరికీ అప్పుడప్పుడు ఊరికినే యిచ్చేనాణ్ణి కదట్రా !

శూన్యం :— నీకష్టం నాగుండెలు బ్రద్దయ చేస్తుందిరా శవం ! నీ పరిస్థితి చూసేటప్పటికి నీపేరుకూడా శూన్యం అని మార్చుకుంటే బాగుంటుందనిపిస్తోంది.

శవం :— పరీక్ష పోయిందని తెలియగానే నాకు ఒళ్ళుమండి, ఆ పేపర్లు దిద్దేవాడు ఏదో కసికొద్దీనో, లేక పెళ్ళాంతో దెబ్బలాడి మనస్సు బాగులేని సమయంలో పేపర్లు దిద్దటం వల్లనో, తక్కువ మార్కులు యిచ్చి వుంటాడని అనుమానం వేసింది. అసలు మార్కులు చూసి వాటిపై తగిన చర్య తీసుకుందామని మార్కులు తెప్పించాను. ఇంగ్లీషులో సున్న, తెలుగులో సున్న, గ్రూపు ఐదు పేపర్లలోనూ ఐదు సున్నలే వచ్చాయి యీ ఏడుసున్నలూ చూసేటప్పటికి నా గుండె బ్రద్దలైంది. కారణం ఏమై ఉంటుందా అని ఆలోచించాను. పరీక్షల్లో టీ ఎక్కువ త్రాగడంవల్ల బాగా పైత్యించిందేమో అని అనుమానం. ఎందుచేతంటే పరీక్షలు వ్రాసి వచ్చాక ఏం వ్రాశానో నాకే తెలిసేది కాదు.

ఫపం :— శవం! నీకష్టం నా గుండెల్లో అండలు అండలు పెకలిస్తోందిరా! ఒక్క కవిత్వపు ముక్కలో నీ విషయం తేల్చాలంటే "శిపం, శవం, ఫపం, భారం, ఇహం, పరం, శూన్యం" అని వ్రాసేయవచ్చు.

ఇహం — ఇదేమిట్రోయి! పేర్లన్నీ ~~యిందుకు మార్చావు~~ ?

ఫపం :— అది కాదర్రా! దీని అర్థం చెబుతా వినండి! 'శివం శిపం' అంటే, శిపం అనే వారికొడుకైన శవంకు "భవం భారం" అంటే, పరీక్షలో తప్పిపోవడంవల్ల బ్రతుకంతా బరువై పోయింది. 'ఇహం పరం శూన్యం' అంటే, వాడికి యీ కష్టదశలో, భూలోకంలోను, పరలోకంలోనూ, అంతటా శూన్యం గోచరిస్తోంది.' అని దీని అర్థం. అదొక్కటే కాదు. మరొక అర్థం చెప్పాలంటే చూడండి! వాడికి పరీక్షలో వచ్చిన మార్కులు ఏడుసున్నలు. యీ శ్లోకంలో సున్నలు కూడా ఏడే! యీవిధంగా మనవాడి స్థితి యీ శ్లోకంలో అన్వయించేను.

అంపర్య్:— ఆహాహా! ఏం కవిత్వంరా! ఆనాడు కాళిదాసు చెప్పాడు కవిత! ఈనాడు నీవు చెప్పావు!

శివం:— మరి నన్ను మా నాన్న దగ్గరికి చేర్చేమార్గం చూడండ్రా! కొంచెం నన్ను గురించి మా నాన్నతో జాలిగా చెప్పండ్రా!

భవం:— మీనాన్న మా సలహాలు వింటాడా! అందులో మీవంటి కుర్రాళ్ళ సలహాలు! నాకు నమ్మకం లేదు.

శివం.— మరి నా గతి యింతేరా! చూడండ్రా! బట్టలన్నీ మాసిపోయాయి. వారం రోజులనుంచి తిండి సరిగా లేదు. మీనాన్న ఒక్క కానీనా యివ్వకుండా గెంటేశాడు. రైల్లో టిక్కెట్టు కొనకుండా దొంగతనంగా వచ్చేశాను నా పరిస్థితి చూస్తూంటే మీకు ఏమాత్రం జాలివేయటం లేదట్రా!

ఇహం:— వీడిని చూస్తూంటే నిజంగా జాలి వేస్తూందిరా! ఏదైనా ఒక ఉపాయం ఆలోచించరా భవం!

భవం — నాకూ జాలిగానేవుంది అయితే నిన్ను కొన్ని ప్రశ్నలు వెయ్యాలి.

శివం.— వెయ్యిరా! అన్నిటికీ సరైన సమాధానాలు యిస్తాను. పరీక్షలో అంటే సరైన సమాధానాలు యివ్వడం కష్టం కానీ. యిక్కడ యివ్వటానికేం!

భవం:— మీ నాన్నకు కవిత్వం అంటే యిష్టమేనా?

శివం:— ఆ. ఎప్పుడూ భాగవత రామాయణాలు చదువుతూ ఉంటాడు. కొంచెం కవిత్వం వ్రాసేవాడంటే, దగ్గరికి చేరుస్తాడు

భవం:— పాటలంటే యిష్టమేనా?

శివం— కర్నాటక సంగీతమంటే యిష్టమే. అప్పుడప్పుడు పల్లెపదాలు కూడా పాడుతాడు.

భవం — జ్యోతిషం పిచ్చి ఏమన్నా ఉందా?

శివం:— కావలసినంత. ఇప్పటిదాకా నేనొక్కణ్ణే కొడుకునిగా. నామీద కోపంవచ్చినప్పుడల్లా నా పీడవదల్చుకుందామని 'యింకా పిల్లలు పుడతారా లేదా' అని జాతకం చూపించుకుంటూంటాడు. తనకు పుట్టే కొడుకు గొప్పవాడై సుపుత్రుడవ్వాలని ఆయన కోరిక.

ఫవం — నీకు పెళ్ళి కాలేదుగా యింకా.

శివం:— లేదు. కాని ఒక మేనరికం ఉంది వాళ్ళు నాకు యివ్వాలనుకుంటున్నారు.

ఫవం. — (యీలలు, చిటికలు వేస్తూ) మీ నాన్నను నీ కాళ్ళ దగ్గరికి తీసుకువచ్చే పూచి నాది. అలాచేస్తే, మాకు బహుమానం ఏం యిస్తావు?

శివం. — ఒకవేళ పరీక్ష ప్యాసయివుంటే ఎల్లాగ "ఒక టీ పార్టీ" యివ్వాలిగా మీకందరికి! దానికి పదిరెట్లు ఒక మంచి టీ పార్టీ యిస్తాను

ఫవం— మమ్మల్ని ఉత్తి టీ పార్టీలతో సంతోషపెట్టలేవు. మాకేమన్నా డబ్బు ముట్టచెబుతానంటే .

శివం— ఒరే! నన్ను యింకా ఏడిపించండర్రా! కాలేజీలో ఉన్నప్పుడు మీ ఖర్చులన్నీ చాలావరకు నే భరించేవాణ్ణి కదుట్రా! యీమాత్రం సహాయం చేసి పెట్టండర్రా!

పరం — ఫవం! యింకా వాడిని ఏడిపించకు అసలే కష్టంలో ఉన్నాడు.

ఫవం— నీకు తప్పకుండా సహాయం చేస్తాం శివం! ఇంక ఏడ్వడం మానేయి... ~~(అందరితో) మీ రంతా కూడా యీ విషయంలో సాయం చేయాల్రా!~~

అందరూ:— ఓ తప్పకుండా

ఫవం:— సరే పదండర్రా! మీ కందరికీ ఒక ఉపాయం చెబుతాను మన శివం విషయంలో.

## రెండో రంగం

*(శివంగారి యిల్లు : వసారా. రెండు కుర్చీలు ఒక బెంచి ఉంటాయి.)*

శివం:— ఒక్కగాని ఒక్క కొడుకు! ఎంతో కష్టపడి, ఎంతో డబ్బు ఖర్చుచేసి 'చదువుకోరా నాయనా' అని ముద్దుగా చెబితే వినక, పరీక్షలో ఠప్ మని తప్పి ఊరుకున్నాడు! ఇటువంటి వాళ్ళని ఒళ్లు హూనంచేసి, ఇంట్లోంచి గెంటేస్తే గాని బుద్ధిరాదు. నాన్న అమ్మా బాగా డబ్బిచ్చి, ఎద్దుల్లా మేపుతుంటే, డబ్బు విలువ తెలియక, విరగబడి సినిమాలూ, నాటకాలు, టీపార్టీలు, ఎన్నికయి మరిగి, చదువులు తగలెట్టు కుంటూంటే వాళ్ళని దగ్గరికి చేరదీయ మని ఎవరు చెప్పారు ?.. చిన్నప్పటినుంచే ఎప్పుడూ మొండి కొడి పీనుగే యీశవంగాడు! యిప్పుడు పరీక్ష ఒక్కసారి ప్యాసవమంటే ఎట్లా ప్యాసవుతాడు ?.. *(విచారంగా)* మావాడు పరీక్ష ప్యాసయి, పెద్ద ఉద్యోగంచేసి నాకు కీర్తి తెస్తా డనుకొనే వాణ్ణి .. తండ్రికి కీర్తి సంపదలు తెచ్చే సుపుత్రులు యీ కలికాలంలో గాలిస్తే మాత్రం కనిపిస్తారా!.... చిలక్కి చెప్పినట్లు అనేక నీతులు చెప్పాను. చెప్పినవన్నీ వింటున్నట్టే ముంగిలా ఉంటాడు! .. చేసేవన్నీ మరొకటి! మరొకటి! . కొంతకాలం బుద్ధివస్తుంది! పోనీ వీధులమ్మట!.. భ్రష్టపు వెధవ!

*(ఇహం జ్యోతిష పండితుడి వేషంలో ప్రవేశం)*

ఇహం:— శివంగారూ!

శివం:— ఎవరు ?

ఇహం.— (నేను పరదేశీయుణ్ణండి. జ్యోతిషంలో బాగా పాండిత్యం వుంది నాకు.) మీ ప్రక్క ఊరు జమీందారుగా రింటికి సన్మానానికి పిలిస్తే వచ్చాను యీప్రాంతాలకు. ఆ జమీందారుగారి చెయ్యి చూసి, ఆయన భవిష్యత్తు గురించి చెబితే, చాలా సంతోషించి, నాకు

వెయ్యి నూటపదహారులు నాకు బహుమానం చేశారు. మిమ్మల్ని ఆయన దాగా ఎరుగునట. ఒకసారి మీ దర్శనం కూడా చేసుకోమని సెలవిచ్చారు.

శివం:— మీరు జ్యోతిష పండితులా ?.... రండి బాబు, లోపలికిరండి . తమ పేరు ?

ఇహం:— నా పేరు 'ఇహం' అంటారు.

శివం:— ఇదేం పేరండోయి!

ఇహం:— దీనిలోని అర్థం సూక్ష్మంగా మనవిచేస్తాను. నేను మనిషి యొక్క 'ఇహం' అంటే, యీ లోకంలోని ప్రస్తుత జీవితం గురించి సర్వసంగతులు చెబుతాను. అందుచేత నన్ను 'ఇహం' అంటారు.

శివం:— మహాచిత్రమైన పేరుపెట్టుకొన్నారండి.... అయితే నా చెయ్యి కూడా చూస్తారేమిటి ? (హో హో హో)

ఇహం:— అందుకే కదండీ వచ్చాను. . (చెయ్యి చూస్తూ) మీరు చాలా అదృష్టవంతులండి!

ఇహం:— మీకు రెండో పెళ్ళి అయింది. మీ మొదటి భార్యకు ఒక కొడుకు.

శివం. - (సంతోషంతో) నా సంసారం అంతా సరిగా చూచినట్టు చెబుతున్నారే!

ఇహం:— ఏమిందోయి! మీ మొదటి భార్య కొడుకు చాలా గొప్పవాడైపోతాడండి!

శివం.— వాడి మొహం! ఇంటరు పరీక్షలో తప్పిపోయినవాడు ఏం గొప్పవాడౌతాడండి! వీడికోసం బోలెడు డబ్బు ఖర్చుచేశాను. పరీక్ష

 తప్పినందుకు కోపం వచ్చి బయటికి గెంటేశాను కూడా!

ఇహాం :— ' అంతా మనమేలుకొరకే ' అన్నట్లు, మీరు అతన్ని బయటికి గెంటివేయడం కూడా అతని మంచికేనండి. మీ చేతిరేఖల మీదుగా పరిశీలిస్తే మీకు యిప్పుడు చాలా ఖ్యాతివస్తుంది. అది మీ పుత్రుడివల్ల !

శివం :— ఖ్యాతి ! ఖ్యాతి వస్తుందండి ! ఇంతకీ నాకు వచ్చే ఖ్యాతి వీడివల్ల అవుతుందదు మీరు కొంచెం పొరబడుతున్నారేమో ! చెయ్యి జాగ్రత్తగా చూడండి ... నాకు యింకో కొడుకు పుట్టి వాడిద్వారా కీర్తి సంపదలు వస్తాయని అందరూ చెబుతున్నారే !

ఇహాం .— రెండవ భార్య ద్వారా మీకు పిల్లలు పుట్టరండి. ఇది నిజం, అందుచేత మీ ప్రథమ పుత్రుడి ద్వారానే మీకు కీర్తి సంపదలు వస్తాయి.

శివం :— ( ఆశ్చర్యంతో ) అలాగండి ! నాకు యింకా పిల్లలు పుడతారనుకుంటున్నానే !

ఇహాం — మీకు ధన ధాన్యాదులకు లోటులేదు. జీవితం హాయిగా గడిచిపోతుంది.

శివం :— చిత్తం.

ఇహాం :— మీచేతిలో ప్రత్యేక విషయం ఒక్కటే ఒక్కటి. మీ పుత్రుడు చాలా గొప్పవాడై పోతాడు. ఒక విధంగా గొప్ప కళారాధకుడని పేరువస్తుంది.

శివం :— కళారాధకుడా ? జడ్జి, కలెక్టరు అనే గొప్ప పదవుల్లోకి వెడితే గొప్పవాడంటారు కాని, కళారాధకుడైతే గొప్పవాడంటారా ? అయితే కళారాధకులకి కూడా అందరూ పూలదండలువేసి గొప్పవాడంటారాండి ?

ఇహాం · యీకాలంలో కళారాధకుడిగా ప్రసిద్ధికి రావడమే చాలా గొప్ప. పత్రాల్లో చూడండి. ఎంతమంది ఎన్నివిధాల కళలకు సేవ చేస్తూంటారో ?

శివం :— అలాగాండి ?

ఇహారం :— మరే.... అసలు నా జ్యోతిష పాండిత్యం యింతగొప్పదని చెప్పకూడదనుకోండి. లంకపురిం జమీందారుగారు, పిష్టపురం రాజావారు, తాడిలంక కలెక్టరుగారు అందరూ నన్ను ప్రశంశించారండి !

శివం :— కాదు మరి ! మీరు చెప్పేవన్నీ సత్యాలని ఋజువవుతూంటే గౌరవించరు మరి !

ఇహారం :— మీ పిల్లవాడు గొప్పవాడైనాక మళ్ళీ వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాగా ! నేను యీనాడు చెప్పినమాట ఆనాడు నిజం అని మీరు అనక మానరు.

శివం :— నాకు కావలసింది అదే ! మీ చల్లని మాటప్రకారం మావాడు గొప్పవాడైతే నేను కోరేదేముంది యింక !

ఇహారం :— తప్పకుండా. నామాట నమ్మండి....నేను మళ్ళీ మిమ్మల్ని కలుసుకుంటాను. ఏదైనా సన్మానం చేయించి నన్ను పంపిస్తే. ..

శివం :— అయ్యో ! తప్పకుండా .. ( *యింట్లోకి వెళ్ళివచ్చి* ) యీ తృణం స్వీకరించి సంతోషించండి యిప్పటికి. మరోసారి మీకు విరివిగా యిచ్చుకుంటా.

ఇహారం :— తమ దయ.

( *నిష్క్రమణ* )

శివం :— అయితే నాకు యింక పిల్లలు పుట్టరన్నమాట. ఉన్న ఒక్క కొడుకును యింటినుంచి గెంటేశానే ! పైగా వాడు చాలా గొప్పవాడౌతాడుట ! ... యిప్పుడు పరీక్షలో తప్పడ మేమిటి ? త్వరలో గొప్పవాడవడ మేమిటి ? ... అంతా చిత్రంగా ఉందే !

( *భారం, కర్నాటక సంగీత విద్వాంసుడి వేషంలో ప్రవేశం* )

భారం :— శివంగారూ !

శివం,.— ఆ. ఆ.

భారం :— నమస్కారం. నా పేరు ' భారం ' అంటారు.

శివం :— ( ఆశ్చర్యంగా ) మీ పేరు ' భారం ' అంటారా ? ఇదెక్కడి పేరండోయి !

భారం :— అవునండి. నేను కర్నాటక సంగీతంలో కీర్తనలు పాడుతూంటే, అవి సరళమై మధుర నాదాలతో భారంగా ఉంటాయంటారు. అందుచేత నాకు ' భారం ' అని బిరుదు యిచ్చారండి.

శివం :— అయితే ...మీరు వచ్చినపని !

భారం :— ఏమీ లేదండి !... నేను ఏదో స్వంతపనిమీద యీవూరు వచ్చాను. యీమధ్య రచయితగా గొప్ప పేరు సంపాదించిన ' శివం ' గారి తండ్రిగారు మీరని తెలిసి ఒకసారి మీదర్శనం చేసుకుపోదామని వచ్చాను.

శివం :— అలాగా....ఏమిటీ ! మావాడు గొప్ప రచయిత అయ్యాడంటున్నారా !

భారం :— మరేనండి ! మీ కుమారులు కొన్ని గీతాలు వ్రాశారు. వాటికి శివగీతాలని పేరు. వాటికి యీమధ్య గొప్పగొప్ప పండితులు ప్రథమ బహుమానం యిచ్చారండి. ఆ గీతాల్లో ఉన్నసారం భగవద్గీతలోకూడా లేదని విమర్శకు లంటున్నారు.

శివం :— అలాగటండీ ! మావాడు ఉత్తి మందకొడి అనుకుంటున్నాను యింతకాలం !... పైగా పరీక్షలో తప్పిపోయాడండి వాడు !!

భారం :— రామ రామ ! అంతమాట అనకండి. ఆయన చాలా గొప్పవారు. అందుకు నిదర్శనం, గొప్ప రచయితగా, ఆయన బంగారు పతకంకూడా పొందారు.....పరీక్షలకి గొప్పతనానికి ఏమీ సంబంధం లేదండి !

శివం :— అలాగటండీ ! ( ఆనందంతో ) మావాడు గొప్ప గ్రంథకర్త అయ్యాడన్నమాట !

భారం :— అన్నమాట ! మరేమిటనుకున్నారూ ! అటువంటి గొప్ప రచయితకు తండ్రులైన మీరు చాలా ధన్యులు.

శివం :— ఆ! ఆ. . దానికేం లెండి. . అయితే మావాడి గ్రంథంకాని మీదగ్గర ఉందా !

భారం :— నేను తీసుకురాలేదు. కావాలంటే యీసారి తెస్తానులెండి . అన్నట్టు మీకొడుకుగారు మీకే పుస్తకం చూపించలేదు ?

శివం :— చూపించలేదు. యీమధ్య పరీక్ష పోయిందని కోపంవచ్చి వాణ్ణి యింట్లోంచి తరిమేశానండి.

భారం :— ఎంత తప్పుపని చేశారు, అటువంటి గొప్పవాణ్ణి యింట్లోంచి గెంటేస్తారా ! యింటికి రప్పించండి పాపం !

శివం :— అదే చేయాలనుకుంటున్నాను.

భారం : - మరి నాకు సెలవిప్పించండి. మళ్ళీ కలుసుకుంటాగా.

( నిష్క్రమణ. )

[redacted] :— చిత్రం.... అయితే మా ' శివం 'గాడు పెద్ద గ్రంథం వ్రాశాడన్న మాట ! వీడు కవి అని యింతకాలం నాకు తెలియదే !

( వయసుమళ్ళిన పెద్ద గవర్నమెంటు ఆఫీసరులా వేషం వేసుకుని, శూన్యం రాక. )

[redacted] :— శివంగారూ !

[redacted] ఎవరండి !

శూన్యం :— మీరేనా శివంగారు !

శివం :— అవునండి.

శూన్యం :— మీతో ఒక చిన్నవిషయం సంప్రదించుదామని వచ్చాను.

శివం :— చెప్పండి.

శూన్యం :— నేను పట్నంలో గవర్నమెంటు ఆఫీసరుగా ఒకచోట పని చేస్తున్నాను. నాకు ఒక కుమార్తె ఉందండి. 15, 16, ఏండ్లు ఉంటాయి. కొద్దో గొప్పో చదువుకుందికూడ. 'శవం' అనే అబ్బాయి మీవాడని తెలిసి మా అమ్మాయిని అతని కివ్వడానికి ఏమన్నా సావకాశం ఉందేమో అని యిలా వచ్చాను.

శివం :— అలాగటండీ! కాని మావాడు పరీక్షలో తప్పిపోయాడండి. ఏదో పరీక్ష ప్యాసు అయినాక పెళ్ళి చేయాలని ఉంది.

శూన్యం :— పరీక్షలకేమండి. యీసారి కాకపోతే మరోసారి ప్యాసు కావచ్చు. మీరు యీ వివాహానికి అంగీకరిస్తే చాలా సంతోషిస్తాను. నాకు గొప్ప రచయిత అల్లుడయ్యాడని గర్విస్తాను.

శివం :— మావాడు గొప్ప రచయిత అని మీ కెలా తెలిసిందండీ!

శూన్యం :— ఎలా తెలియడమేమిటండి! ఏ పేపరులో చూసినా అతని బొమ్మే! అతన్ని గురించి పొగడ్తలూ, వార్తలూను! అతను వ్రాసిన గీతాలే కనిపిస్తున్నాయి. అంత పేరు ప్రతిష్టలు సంపాదించిన వారిని తెలియకుండా ఎవరుండగలరండి!

శివం :— మీరంతా నాకంటే నయమండి! యిప్పటిదాకా మావాడు రచయిత అనైనా తెలియదు నాకు.

శూన్యం :— నిండుకుండ తొణకదు. అందుచేత గొప్పవాళ్లు వాళ్ళగురించి ఎప్పుడూ చెప్పుకోరు. అందుకే మీ కుమారుడు తాను కవి అని మీతో చెప్పి ఉండకపోవచ్చు.

శివం :— నిజమైన మాట సెలవిచ్చారు.

శూన్యం :— అందుచేత యీ వివాహం విషయంలో మీ ఉద్దేశ్యం చెబితే, కట్నం విషయంకూడా మాట్లాడుకోవచ్చును.

శివం :— కట్నానికేం లెండి !.... మావాడి కొక మేనరికం ఉంది. మేనరికం చేసుకోక పోతే మా చెల్లెలు పీక చంపేస్తుంది. చాలా కాలంనుంచి పట్టుబడుతోంది తన పిల్లని మావాడికి చేసుకోమని.

శూన్యం :— అయితే మీ అబ్బాయికి మేనరికం ఉందన్నమాట ! మేనరికం ఉంటే మా పిల్లని యిస్తాననడం కూడ భావ్యం కాదు. యింతకీ ఆ పిల్లవాణ్ణి అల్లుడుగా చేసుకునేవాళ్ళు చాలా అదృష్టవంతులు.

శివం :— ఏదో మీరు అభిమానంతో అంటున్నారు ...కాని,

శూన్యం :— ఇది అభిమానంతోకూడిన సంగతి కాదండి. ఇటువంటి గొప్ప రచయిత అల్లుడైతే ఎవరికైనా గర్వం కదుటండీ !

శివం :— ( హీ. హీ. హీ. ) .. అన్నట్టు తమకు గవర్నమెంటు పని అన్నారు. ..ఏమాత్రం జీతమిస్తారేమిటి ?

శూన్యం :— 800 రూ. లు.

శివం :— ( ఆశ్చర్యంగా ) 800 రూ. లే ! బాగుందన్డండి .. మా కుర్రాడి గురించి మీలాంటి పెద్దలు మా యింటికి వచ్చారు గాని, లేక పోతే మాకోసం రమ్మంటే మాత్రం వస్తారా !

శూన్యం :— మీ కుర్రాడి గొప్పతనం ముందు మా పెద్దరికం, గొప్పతనం వెలవెలబోతాయి. మా పేరు ఆఫీసుదాటి బైటికి వెళ్ళదు. మీవాడి పేరు దేశమంతా వ్యాపించేసింది.

శివం :— చాలా సంతోషమైందండి మిమ్మలిని కలుసుకున్నందుకు.... కాని పరిస్థితులివి.

శూన్యం :— దానికేంలెండి ... మరి సెలవు తీసుకుంటా.... మళ్ళ అవసరమైతే కలుసుకుందుకు ప్రయత్నం చేస్తానండి....
( నిష్క్రమణ )

శివం :— మంచిదండి. ఏమిటీ! మనవాడి గొప్పతనం దేశం అంతా వ్యాపించి పోయిందా!.... యింతంత ఉద్యోగస్తులు తమ పిల్ల నివ్వడానికి వస్తున్నారంటే తమాషా!

( *ఒక పత్రికా విలేఖరి వేషం వేసుకుని కెమెరాతో ' పరం ' ప్రవేశం* )

పరం :— ( *హడావిడిగా* ) శివంగారూ! శివంగారూ!

శివం :— ఎవరయ్యా అది!

పరం :— నేను పత్రికా విలేఖరినండి... నా పేరు పరం!

శివం :— పరం! ' పరం ' ఏం పేరయ్యా!

పరం :— అంతేనండి. అంటే నేను మీవంటివాళ్ళ గొప్పతనం పోగుచేసి పత్రికలకు పంచిపెడతానండి. ఈ లోకంలో మీరు ఎంత గొప్ప పనం తెచ్చుకో గలిగితే అంత సుఖం మీరు స్వర్గంలో పొందుతారు. మీ గొప్పతనాన్ని గుర్తించి మీ ' పరం ' లోని సుఖం పొందడానికి ఉపయోగంచే వాడిని కనుక, నన్ను పరం అంటారండి!

శివం :— బాగుంది.... అయితే మీరు ఎందుకువచ్చినట్లు యిక్కడికి?

పరం :— మీరు గొప్పవారయ్యారని తెలిసి.

శివం :— ( *ఆశ్చర్యంగా* ) నేను గొప్పవాణ్ణయ్యేనా!

పరం :— అవునండి. మీరే! మీ కొడుకు ' శవం ' అనే ఆయన దేశంలో గొప్ప రచయితగా ప్రసిద్ధి పొందారు. ఆయన దగ్గరకు వెళ్లి, ఆయన ఫొటోలు, రచనలు తీసుకుని పత్రికల కిచ్చాను. మీరు ఆయన తండ్రిగారవడంవల్ల మీ ఫొటో కూడా తీసుకుందామని వచ్చాను.

శివం :— నా ఫొటో ఎందుకయ్యా!

పరం:— అల్లా అనకండి ... మీఫొటో యిచ్చెయ్యాలి.

శివం :— నే నెప్పుడూ ఫొటోలు తీయించుకున్న పాపాన పోలేదే ।

పరం :— మీ కెందుకండి ఆశ్రమ । నే తీసేస్తాగా మీ ఫొటో యీ కెమేరాతో ।

శివం :— తర్వాత నా ఫొటో ఏం చేస్తారు ।

పరం :— పత్రికలలో వేస్తాం. ' శవం ' గారి తండ్రి ' శివం ' గారని మీరు అటువంటి కొడుకుని కన్నందుకు చాలా ధన్యులయ్యారని.

శివం :— ( ఉబ్బిపోయి ) నిజంగానే.. . ( ఉల్లాసంతో ) తీసుకోండి. నా ఫొటో తప్పకుండా, త్వరగా తీసుకోండి.

పరం :— సరిగా కూర్చోండి.... ఒక చిరునవ్వునవ్వండి. ( ఫొటో తీస్తాడు ) యింక మీ కుమారులు గొప్ప రచయిత అయ్యారుగా । యీ విషయం గురించి మీరు ఏమి చెప్పదలచుకున్నది సెలవి య్యండి. అది కూడా పత్రికల్లో వేయాలి.

శివం :— నేనేం చెప్పగలను । అంతా సంతోషించామని పత్రికల్లో వ్రాయించండి.

పరం :— అలా వ్రాయమండి మేము. మీరు ఏమీ చెప్పకపోయినా మీరు చేసిన భావప్రకటన అనుసరించి యిలా వ్రాస్తాము :

" శవంగారి తండ్రియైన శివంగారు తమ కొడుకు గొప్ప రచయిత ఐనాడని తెలిసి, అమందానంద కందళిత హృదయారవిందులై నారని తెలియజేయుటకు మేము చాలా సంతోషించు చున్నాము. "

శివం :— బాగుందండి. చాలా బాగుంది. అలా వ్రాయించేయండి.

పరం :— యింకా ఏమన్నా చెబుతారా ।

శివం :— యింకేం చెప్పమంటారు। కాని ( దుఃఖంతో ) మావాడు పరీక్షలో తప్పిపోయాడని యింట్లోంచి గెంటేశాను. ఇంత గొప్ప వాడవుతాడని తెలిస్తే అలా చెయ్యకపోదును.

పరం :— మీరు యింట్లోంచి గెంటేశారా అయన్ని। ఎంత తప్పుచేశారు. ఏ తండ్రి ఐనా అటువంటి కొడుకును పొందినందుకు సంతోషిస్తాడు. కాని యింట్లోంచి గెంటేస్తాడా ?

శివం :— మీకు పుణ్యముంటుంది. కొంపదీసి నేను యిలా చేశానని పేపర్లో మాత్రం వ్రాయకండేం। నాకు చాలా అప్రదిష్ట. పెద్ద కుటుంబీకుణ్ణి కూడ.

పరం :— ఎంతమాటన్నారు। ఒకసారి ఎవరైనా గొప్పవాళ్ళయిపోయాక, వాళ్ళు చేసే చెడుపనులు గురించి, ఎవరైనా వ్రాయమన్నప్పటికీ మేము పేపర్లలో వ్రాయమండి.

శివం :— మీరు చాలా మంచివారండి. .. అయితే మావాడు ఎక్కడ ఉన్నాడండి యిప్పుడు.

పరం .— ఒకచోట ఎట్లా ఉంటాడు ? యీ మధ్య దినం అంతా తిరిగి ఉపన్యాసాలు చాలాయిస్తున్నట్లు మాతోటి విలేఖరులు వ్రాస్తున్నారు.

శివం:— మా వాడు ఉపన్యాసాలు కూడా యిస్తున్నాడన్న మాట! యింకేం। ఎంత గొప్పవాడయ్యాడు। .. యింతకీ దేశంలో నలు మూలలకి వెళ్ళడానికి డబ్బెక్కడిదండీ। నేను ఒక్క పైసకూడా యివ్వకుండా గెంటేశానే।

పరం :— అటువంటి గొప్పవాళ్ళకు డబ్బు ఎవరైనా యిస్తారు. ఆయన ప్రజలకు విజ్ఞానం యిచ్చి సేవచేస్తున్నారు. అందుచేత ప్రజలే పోషిస్తూంటారు.

శివం :— ఆహాహా।.... ఈవేళ ఏం దినమండీ। మా వాడు ఎంతగొప్ప వాడైపోయాడు। నాకు పత్రికలు చూసే అలవాటు లేదండీ.

అందుచేత నాకీ విషయాలు అస్సలు తెలియవు... నా ఫోటో కొంచెం జాగ్రత్తగా వేయిస్తారు కదూ పత్రికల్లో.

వసం :— తప్పకుండా.

శివం :— నా బొమ్మపడిన పత్రికకూడా నాకు పంపించండి!

వసం :— అవశ్యం. మరి నే వెళతానండి. నేను యింకా చాలా మందిని కలుసుకోవాలి. ( నిష్క్రమణ )

శివం :— మంచిదివాబూ! నేనుకూడా ఒక విధంగా గొప్పవాణ్ణవుతున్నా నన్నమాట. మా శివంగాడు ఎంత ఉత్తమ పుత్రుడు! యిట్టే గొప్పవాడై పోయి తండ్రికి కీర్తి తెచ్చాడు. పోనీ! వెధవపరీక్ష పోతే పోయింది. పాపం. వాడెక్కడున్నా వెతికి యింటికి తీసుకురావాలి.

( పంచ, లాల్చి, సిల్కుకండువా, కళ్ళజోడు, పెట్టుకుని ఒక కవిలా 'భవం' ప్రవేశం )

భవం — ఏమండోయి! శివంగారూ!

శివం — ఏమిటి! యీవేళ యింతమంది వస్తున్నారు నాకోసం.... ఎవరండి?

భవం — నన్ను 'భవం' అంటారు

శివం — యిదేం పేరయ్యా! అందరూ యిటువంటి పేర్లు పెట్టుకుంటున్నారేమండి?

భవం — ఇది నా కలం పేరు. నా రచనలన్నీ యీ పేరుతో పత్రికలలో పడతాయండి.

శివం :— నీ పేరుచూసి ఎవరూ నవ్వరుటయ్యా! నాకుమాత్రం నవ్వు వస్తోంది ..'భవం' ఏమిటి?

భవం :— నేను భావకవిని. భావకవి అంటే భావం ప్రధానంగా కవిత్వం చెప్పేవాడు. భావకవి పదంలో, కవిపదం వదిలేసేను పురాతన

కపుల్లా ఉండడం యిష్టంలేక. తరువాత 'శాపం' అని మొదట నా పేరు పెట్టుకున్నాను. ఆపైన యింకా చిన్న పేరు పిలుపు చాలా మంచిదని 'శవం' అని మార్చేసుకున్నాను.

శివం :- బాగుందండి. యింతకీ మీరేమి పనిమీద వచ్చారో చెప్పారు కాదు

శవం — శివంగారు మీ సుకుమారుడని తెలిసింది. ఆయన యీమధ్య గొప్ప కవిగా ప్రసిద్ధికెక్కారు. ఆయన జీవిత చరిత్ర వ్రాయాలని ఉత్సాహం కలిగి. ఏమన్నా వివరాలు మీరు చెబుతారేమో అని వచ్చాను.

శివం :- ఆఁ మీరు పిచ్చియి గదా! ఏదైనా ఒక గ్రంథం వ్రాయకోక జీవిత చరిత్ర వ్రాయడ మెందుకండీ?

శవం :- దానికి ఒక కారణం ఉందిగా. మీరు కాబట్టి చెబుతున్నాను గొప్పవాళ్ళ జీవిత చరిత్రలు తెలుసుకోవాలని చాలా మందికి ఉత్సాహంగా ఉంటుంది. అందుచేత వాళ్ళ జీవిత చరిత్ర వ్రాస్తే దానిని చాలామంది చదువుతారు. నేను వ్రాసిన జీవితచరిత్ర చదవడంవల్ల ఒకవేళ నేను ఏ గ్రంథం వ్రాయలేక పోయినప్పటికీ. అందరూ నన్ను ఒక రచయితగా పరిగణించి నన్ను చాలా గొప్పగా చూస్తారు.

శివం :- బాగుంది మావాడికి పెద్ద జీవితచరిత్ర ఏముంది? కుర్రకుంక! 21 ఏండ్లయినా నిండలేదు. యీ వూళ్ళో పుట్టాడు 21 సంవత్సరాల క్రితం పుట్టగానే ఏదో చాల రోగంతో పుట్టాడు చాలా కాలందాకా శ్వాసదాగా కనిపించేది కాదు వాడు బ్రతికి ఉన్నాడో చనిపోయినాడో కూడా తెలియలేక పోయేవాళ్ళం. పైకి మాత్రం పూర్తిగా శవంలా కనిపించేవాడు. ఏదినాడు శనిలో పుట్టడంవల్ల వాడిని రెండేళ్ళదాకా శని పీడిస్తుంది రెండేళ్ళు 'శవం'గా ఉండి రోగంతో బాధ పడ్డాడు. ఆ రెండేళ్లు అందరూ వాణ్ణి శవం అని పిలిచేవారు. తరువాతకూడా అదే పేరు వాడుకలోకి వచ్చే

సింది. అందుచేత, ఇంక ఖర్చులుకూడా ఎందుకని, నామకరణమే చెయ్యలేదు మావాడికి.

భవం :— ఆయనపేరుకే పెద్ద చరిత్ర ఉందన్నమాట!

శివం :— మరేనండి. తరువాత ఏదో చదువుకుని పెద్దవాడై యింతవాడయాడు వాడు ఎప్పుడు ఎక్కడ చదివింది మొదలైన విషయాలు తేదీలతో జ్ఞాపకం చేసుకుని యీసారి చెపుతానులెండి.

భవం :— అయితే నే మళ్ళీ రావాలన్నమాట!

శివం :— లేకపోయినా మీ చిరునామా యిస్తే, పోస్టులో పంపిస్తా.. మీరు మావాడి గ్రంథం కాని చూశారా?

భవం :— మీ అబ్బాయిగారి దగ్గరనుంచి శివగీతాల కాపీ ఒకటి తీసుకున్నాను. ఆ పుస్తకం యిదుగో నాదగ్గరే ఉంది. (పుస్తకంయిచ్చి) దీనిగురించి విమర్శకూడా వ్రాద్దామనుకుంటున్నాను. రచయిత పేరు 'శివం' కనుక, యీ పుస్తకానికి శివగీతాలు అని పేరు పెట్టి ఉంటారు.

శివం :— (పుస్తకం చూసి) నాకు సరిగా అక్షరాలు కనిపించటం లేదు. రెండు గీతాలు మీరు చదివి వినిపిద్దురూ!

భవం :— (*గాలిలో గాలి తంత్రులను*)

గొప్పతనం అంటే
చక్కటి పప్పుకం

మానవులంతా
ఆశలు కలిపి
మర్దించి
గుటకయస్వాహ్ !

ఆడదాని అందంలా
ఆకాశంలో వెలుగుల్లా
అనంత ప్రకృతిలా

ఆకర్షించును! ఆకర్షించును!
గొప్పతనం! గొప్పతనం!

విశ్వవ్యాప్తమయిన వాయువు గురించి, కనిపించని అనంతమైనటు వంటి గొప్పతనం గురించి, యింకా మరుగైన వాటిని గురించి మెరుగు తీగల్లా తళుక్కుమనే భావాలతో శివంగారు గీతాలు రచించారు మీ అబ్బాయి అయితే యీ పుస్తకం మీకు చూపించనేలేదా?

శివం :- ఆ యోగత లేదు నాయనా. (దుఃఖంతో) పరీక్షలో తప్పిపోయాడని ఏదో కోపంవచ్చి యింట్లోంచి గెంటేసినవాణ్ణి మావాడు యింత గొప్పవాడవుతాడని నాకేం తెలుసు?

ఘనం :- అయ్యయ్యో! ఎంత తప్పుపని చేశారు?

శివం :- యిప్పుడు చాలా విచారిస్తున్నాను. మావాడిజాడ మీకేమైనా తెల్సినా చాలు!

ఘనం :- తెలియకేమండి! గొప్ప రచయితలంతా కలిసి పట్నంలో 'విజ్ఞాన విజృంభణ సమాజం' అని ఒకటి తెరిచారు. దానికి మీ అబ్బాయిని అధ్యక్షుడిగా ఎన్నుకున్నారు. అది చాలా గొప్ప పదవి. ఎంతో గొప్ప రచయిత అయితేగాని ఆ పదవి అలంకరించడం కష్టం.

శివం :- అలాగాండి! మరి మావాడికి జీతమేమైనా యిస్తారా?

ఘనం :- దానికి జీతం ఏమీ ఉండదండి. అయినా డబ్బు కావాలంటే లక్షలాదిరూపాయలు ప్రజలే యిస్తారు అటువంటి గొప్పవాళ్ళకు; యిటువంటివన్నీ ప్రజాసేవచేసే సంఘాలు గాంధీగారికి ఏం జీతం యిచ్చారని ఆయన ప్రజాసేవ చేశారు? అలాగే మీ అబ్బాయికూడ

హడావిడిగా కాగితాలు చూస్తూన్నట్లు ఫోనులో మాట్లాడుతూన్నట్లు నటిస్తూంటాడు. అతని కోటుకు ఒక బంగారుపతకం తగిలించి వుంటుంది.)

(శివం, శుభం రాక)

శుభం — రండి : మీ అబ్బాయి యిక్కడే వున్నారు !

శివరా :— (ఆనంద దుఃఖాలతో) ఒరే శివం, నాయనా ! ఎంత తప్పు చేశానురా ! యింత గొప్పవాడవై పోతావని తెలిస్తే యింట్లోంచి వెళ్ళగొట్ట నిచ్చేవాణ్ణా ! (అని కౌగలించుకుంటాడు)

శివం :— పోనీలెండి నాన్నగారు ! ... అయిపోయిందేదో అయిపోయింది.

శివరా : యీ ఆఫీసంతా నీ దేరా ! యింత చక్కటి సూటు ఎక్కడిదిరా ! కుట్టించుకున్నావా !

శివం :— నేను కుట్టించుకునేదేమిటి ? ప్రజలే పట్టుబడుతూంటే యిచ్చారు బహుమతి !

శివరా :— చాలా సంతోషం శుభంగారూ ! మీ సహాయం మరిచిపోలేనండి మళ్లీ మా వాడి దగ్గరకు నన్ను చేర్చారు.

శుభం :— నేను ఎప్పుడూ మీ వాణ్ణే నాన్నగారు. ఒకళ్ళు మనలిని విడదీయలేరు, చెప్పలేము

శివరా :— నాకు తెలియదూ ! నేనంటే నీకెప్పుడూ అభిమానమే నేనే తెలివితక్కువగా నిన్ను గెంటేశాను యింట్లోంచి !

శివం :— దానికి విచారించకండి నాన్నగారు !

శుభం — ఏముందోయి ! మీవాడి కోటుమీద బంగారు పతకం చూశారా ! అది ఆయన శివగీతాలు వ్రాసినందుకు బహుమతి !

శివరా : - (సంతోషంతో) ఆహాహా ! ఏం బాగుంది ! బలే బాగుంది. నిజ ంగా మెరుస్తోంది యీ పతకం మంత్రికి కీర్తిసంపదలు తెచ్చా

శివం :— (హాహాహా) మరి మావాడంతే ఏమనుకున్నారు !... పోదాం రారా ! శవం !

శవం :— ఏమోయి ! భవం ! నేను మా వూరు వెళ్ళి రెండు రోజుల్లో వస్తాను. నా ఆఫీసు చూస్తూవుండు యీలోపుగా.

భవం :— తప్పకుండా. (శవం, శివం నిష్క్రమణ)

ఇహం :— ఏంరా భవం ! నీ గీతాల పుస్తకానికి వాడిని గ్రంథకర్తగా చేశావేమిటి ! ఏమదృష్టవంతుడురా, శవం ! యిట్టే కవిగా పూరు కున్నాడు !

ఘాస్యం :— ఆ బంగారు పతకం, ఆసూటు పోయినట్టేనా యింక !

భవం :— వాటి ఖరీదు యిచ్చేస్తానని చెప్పాడుగా !

పరం :— మనకి కాలేజీలో పెట్టిన మారుపేర్లు యిన్నాళ్ళకు యిలా సరైన ఉపయోగానికి వస్తాయని ఎవరనుకున్నారు !

ఖాళం :— దానికేం గాని మనకి టీ పార్టీ యివ్వకుండా పోయాడే యీ శవం గాడు !

...ం — మళ్ళీవచ్చాక వడ్డీతో సహా పుచ్చుకుందాం !

— ఇహంగారూ, భవంగారూ, ఖాళంగారూ, ఘాస్యంగారూ ! మీరు చేసిన ఘనకార్యాలకు మీ ఫొటోలు తీసుకుని పత్రికల్లో వేయిస్తాను ఫొటో దిగ్వండి. (అంతా నిలుచుంటారు ఒక వరుసలో) చిరునవ్వు నవ్వండి . (ఫొటో తీస్తాడు కెమేరాతో) పత్రికల్లో ఏమని వ్రాయించమన్నారు ? (నోటుబుక్కు పెన్సిలు పుచ్చుకు నిలబడుతాడు) చెప్పండి !

:— పరంగారైతే యింక యిటువంటి వెర్రి వేళాలను కట్టిపెట్ట మన్నా మని పత్రికలో వ్రాయించండి.

(నవ్వులు)



# కనువిప్పు


రచయిత :
శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

జననం : 1914

నివాసం : హైద్రాబాదు


కార్యకలాపాలు : దేశోద్ధారక గ్రంథమాల నిర్వహణ.

అభిరుచి : విషయసేకరణము, కథలు, నాటికలు, నవలలు.

రచనలు : ముద్రితం : జైలులోపల (కథానికలు)
ప్రజల మనిషి (నవల)
పత్రికలలో నాటికలు, కథయ.
అముద్రితం : గంగు (నవల) పరిసరాలు (కథానికలు)

అభిమానరచయితలు : మాక్జింగోర్కీ, ముల్క్‌రాజ్ ఆనంద్. కె. ఏ. అబ్బాస్, కొడవటిగంటి కుటుంబరావు, ఆచార్య ఆత్రేయ, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి



పాత్రలు :

మల్లయ్య

గంగయ్య

కొమరయ్య

పీరయ్య

రంగయ్య

తిరుపతయ్య

రాము



# కనువిప్పు

## ఒకటో రంగం

*[మల్లయ్య. వయస్సు 40 సంవత్సరాలు. మంచముమీద, గొంగడి పట్టపై కూర్చొని ఉంటాడు. మంచానికి చేతికర్ర నిలువుగా పెట్టి ఉంటుంది. తెర ఎత్తేవరకు మల్లయ్య పొగాకుకాడలు తీస్తూ కూర్చుంటాడు. కొమరు గంగయ్య విచారంలో ప్రవేశించి నెత్తి గోకుతూ మధ్య, మధ్య తండ్రిని భయంతో చూస్తుంటాడు.]*

మల్లయ్య :– ఒరే గంగడు! ఏమైంది పోయిన పని? ఏమంటడు కొమరయ్యమావ?

గంగయ్య ... (మాట్లాడడు.)

మల్లయ్య – ఏం పెట్టుకున్నవు నోట్లో?

గంగయ్య – (మాట్లాడడు)

మల్లయ్య -- ఏందిరా, దయ్యం పట్టిందిరా. మాట్లాడవు?

గంగయ్య :– కొమరయ్య మామ

మల్లయ్య :– ఆఁ కొమరయ్య మామ?

గంగయ్య :– మన పేరు తీస్తే మండిపోతుండు.

మల్లయ్య – మండి మసికాకపోయిండు!

గంగయ్య – యీరయ్యమావ ఇంటికే రానని ఉత్తరం రాసిండట.

మల్లయ్య :– ఆఁ రాకేంజేస్తడు

గంగయ్య – మన ఎల్లమ్మను ఒద్దసంగా పెండ్లి చేయబట్టే యీరయ్య మావ మనిసెరిగింపంపు కొమరయ్యమావ.

మల్లయ్య :— మొగుడు వద్దంటున్నా నా పాణం తీసినే ఇప్పుడేమంటది యెంకమ్మత్త ?

గంగయ్య :— యీరయ్యబావ ఉత్తరం వచ్చినకాడ్నించి యెంకమ్మత్త ఒకటే ఏడుస్తది యిగ కొడుకుయ మాటేమొ. బాగైంది. ఆతి పెట్టినట్టయింది అంటున్నడు

మల్లయ్య :— అది సంగటి. తనకిష్టంగాని సంబంధం చేసినంగద ! కొడుకు ఏమన్నా సూస్తున్నడు ( ఆలోచించి ) గంగడూ ! మీ బావ యీరేశం పెద్ద పెద్ద చదువులు చదువుతాండె, మరి యిదేం బుద్ధిరా ?

గంగయ్య :— ఏమోనే.

మల్లయ్య :— ( దీర్ఘంగా ఆలోచించి ) బావ పతా సిరెరికేనారా ? నేను ఓ ఉత్తరం రాయిస్త. సాతాని వంతులు ఇంటికాడ ఉన్నదేమొ చూచిరాపో.

( గంగయ్య వెళ్ళిపోతాడు )

మల్లయ్య :— గంగడూ ! ఓపని చేద్దాం. మన సాతాని వంతుల్ని మీబావ కాడికి పంపి, మీబావ మనుసేందో తెలుసుకోవాల్రా. సదువు కున్నోండ్లయిరి. మనిసిచ్చి మాట్లాడుకుంటరు ఏమంటవు ?

గంగయ్య :— అవునయ్య.

మల్లయ్య :— గంగడూ ! పనికైసి మంచిది నువ్వుగూడ వంటవెమ్మకిపో.

గంగయ్య :— అమ్మనుగూడ అడుగుదాం ఏమంటదో.

మల్లయ్య :— ఒరేగంగడూ ! మీ అమ్మమాట నా మందల తీయకు. మీ అమ్మ, ఆ యెంకమ్మత్త ఇద్దరు కల్సి పిల్లను ఉరి పోశిన్రు.

( లింగయ్య ప్రవేశం. )

లింగయ్య :— మల్లన్న కిప్పుడు తెలిసొస్తున్నయి అన్ని. నేనెప్పుడో చెప్పిన కదా సంబంధం వద్దని.

మల్లయ్య :— దా, రంగయ్యా, దా, కూసో. నా మనసంతా ఎట్లగో ఉంది. ఇంకా నాకు బొగేయకు.

రంగయ్య :— అప్పుడూ అదే అన్నవు, నేనేదన్నా నీకట్లగే అనిపిస్తది.

గంగయ్య :— అంటే, మరి అప్పుడు యీరయ్యబావంటే ఎంతమంచను కున్నాం. సదువు కుంటాండె. ఇంతో( అంతో యగసాయం ఉండె. ఒక్కడే కొడుకాయె. పుల్లమ్మ నసీబ్ బాగుందనుకున్నాం.

మల్లయ్య — మనకు సదువులు అచ్చిరావురా ! మన పనులు మనకు సక్కగుండావెగాని, ఈ సదువులు, కొలువులు మనకు పనికిరావు. సరే, పో. అమ్మ సటుగు ఏమంటదో.

(గంగయ్య వెళ్ళి పోతాడు.)

రంగయ్య :— యీరయ్య సంగతేమన్నా తెలిసిందా ?

మల్లయ్య :— (తల నేలకువేసి ఆలోచిస్తాడు.)

రంగయ్య :— పాపం ! పుల్లమ్మ, అంగడు పోంగ మిగిలినబిడ్డ తొందరపడి వాయితో పోయిన్రు

మల్లయ్య :— పోనీ రంగయ్యా, ఆ సంగతెత్తకు.

రంగయ్య :— నేను పట్నంపోయి నిన్ననే వచ్చిన . సరే, మళ్ళా కల్సుకుంట, నీ మనస్సు బాగలేదు. (వెళ్ళిపోతాడు.)

మల్లయ్య :— ఆ ! పట్నం పోయొచ్చినవ దా, రంగయ్యా, దా, కూసో, ఏంసంగతి ? మా అల్లుడు కనబడ్డిడా ?

రంగయ్య :— పట్నం పోయినాక, నీ అల్లుడిని చూడకుండ వస్తనా ?

మల్లయ్య — అట్లనా ! అయితే చెప్పవు ? ఏమన్నడు ? నీకెట్ల కలిసిండు? పట్నానికి దూరంగా ఎక్కడో పెద్ద బంగళాలో ఉంటడటగా ! ఆడ పటా దొరకటమే సానా కష్టమంటరు. మా గంగడు ఏమేమో చెప్తుంటడు. సరే పోనీగాని, మరి ఏంమాట్లాడినవు ?

రంగయ్య :— నేనేం మాట్లాడత. అసలు నీ అల్లుడు నన్ను గుర్తుపట్ట లేదులే. నేనే కనిపెట్టి కొంతదూరం వెనకాల నడుస్కుంటు పోయిన.

మల్లయ్య :— కనబడ్డప్పుడు మాట్లాడకపోయినవు మరి ?

రంగయ్య :— నీ అల్లుణ్ని నేను గనుక గుర్తు పట్టినగాని, ఇంకోరికి కష్టం. అసలు యేషమే ఎట్టగో ఉంది.

మల్లయ్య :— అవును, పెద్ద పెద్ద సదువులు సదివెటోళ్లు అసుంటి బట్టలే యేసుకోవాల్నేమొ !

రంగయ్య :— యేషంతోటే పోయిందనుకోకు. (మల్లయ్యవైపు వంగి) ఎవరో పడుసుపిల్లగూడ యెంబడుంది మల్లయ్యా !

మల్లయ్య :— ఆ!... .నిజంగినా రంగయ్యా ? నువ్వు సూచింది నా అల్లుణ్నేనా ? బాగా గుర్తుపట్టే చెప్తున్నావా ?

రంగయ్య :— మల్లన్నా, నీమనుస్సు బాగలేదు. మళ్ళ కలుస్త. జర చేను కాడికి పోవాలె. (వెళ్ళాడు.)

మల్లయ్య :— ఎంతపనాయె, అంత కలిసి నా బిడ్డను యినం పోశిన్ను. (*గద్గద స్వరంలో*) పుల్లమ్మా నీగతి యేమైతదో (*కండ్లు మిడుమిడుకుంటూ లోపలికి పోతుంటగా తెర పడ్తుంది.*)

## రెండో రంగం

[*వీరయ్య హోటల్ గదిలో టాయ్‌లెట్ చేసుకుంటుంటాడు. మధ్య మధ్య గడియారం చూస్తుంటాడు.*]

(*తిరుపతయ్య ప్రవేశం.*)

తిరుపతయ్య :— ఏం వీరయ్యా ! బాగున్నవా ?

పీరయ్య — అగో! ఎప్పుడొస్తివి? ఇట్లనే వస్తివా? బట్టలెక్కడ పెట్టినవు?

తిరుపతయ్య :— నేను. . కొంచెం కచేరిపని ఉండి వచ్చిన్లే. బట్టలు, అవి వకీలుగారింట్లో పెట్టి, కలిసి పోదామని ఇట్లొచ్చిన.

పీరయ్య :— నాయన, అమ్మ బాగున్నారా?

తిరుపతయ్య :— బాగుండకేంగాని, నీ ఫికరే వాండ్లకు పొద్దస్తమానం.

పీరయ్య .— నాకయ్యే ఖర్చు పెట్టలేకనా?

తిరుపతయ్య :— యెహె! కడుపున పుట్టినోండ్లకు పెట్టుకోకపోతే ఇంకెవరికి పెట్టుకుంటరు? కాని మీమామ ఆ మల్లయ్య ఉన్నదే బలే మోసం చేసెండు.

పీరయ్య .— మోసమా! ఏమిటది?

తిరుపతయ్య :— ఇది మోసంగాక ఇంకేంది చెప్పు? నిన్ను చదివించి గొప్పవాణ్ని చెయ్యాలని మీ నాయినకు ఇంతా అంత ఫికరుకాదు. ఏదో మేకిన్నెళ్ళకు చన్నీళ్ళు ఆసరన్నట్టు మీమామ మల్లయ్యను కావా కొంత అడిగిండనుకో.

పీరయ్య :— నన్ను చదివించడానికి మా మామను డబ్బు అడిగిండన్న మాట మా నాయన.

తిరుపతయ్య :— దీంట్లో తప్పేం ఉంది? మరాయనవాండ్లమా! అల్లుళ్ళను చదివించెటోండ్లెందరు లేరు?

పీరయ్య :— ఊహూ! అదాసంగతి? అందుకేనేం నేను డబ్బు కావా లన్నప్పుడల్లా మా నాయన గొనగొనలు, రుసరుసలు మొదలు పెడ్తుంటడు.

తిరుపతయ్య :— నువ్వే ఆలోచించరాదు? నీ పెండ్లిలో మీమామ సరేనని తల ఊపి, ఇప్పుడు మాటతప్పటం ఎంత బాగుంది!

వీరయ్య :— మల్లయ్యమామ ఉత్తరాల్లోమాత్రం ప్రేమ ఒలకపోస్తుంటడే.

తిరుపతయ్య :— అదంతా మోసం. మీ మల్లయ్యమామకు బాగా బుద్ధి చెప్పాలని నేనో మంచి ఆలోచనచేసిన, మీ నాయనకూడా ఒప్పుకున్నడ్డు.

వీరయ్య — ఏమిటది ?

తిరుపతయ్య :— నువ్వు గొప్ప గొప్ప నవలలు సదువుతుంటివిగద ! అవివినువిని ఆ పుల్లమ్మతో ఎట్ల కాపురం చేస్తవో ఆలోచించినవ ?

వీరయ్య .— అంటే ?

తిరుపతయ్య .— ఏం లేదు ? ఓ మంచి అమ్మాయిని పెండ్లి చేసుకుంటివా చిలకా గోరెంకలోలె హాయిగా ఉండొచ్చు

వీరయ్య .— నా సంగతేందో తెల్సుకోందా పని మాట్లాడుతున్నవా ?

తిరుపతయ్య — నిన్ను నేనట్లా అనుకుంటున ? నీతెలివి, నీచదువుచూసి, పంతులంటి నోట్లనీవున్యాయుతున్న యనుకుంటున్నవు ? మంచి పాటం మిత్రుడోడు లేదు ? వాండ్లపిల్లలంతా ఆడ, మగ యిక్కడే సదువుకుంటున్నరటగద.

వీరయ్య .— అవును. ఆడపిల్ల తెలుకలేదుగాని, మగవాండ్లుమాత్రం నాకు స్నేహితులే

తిరుపతయ్య — సరే ఇంకేం యిక ఆడపిల్లలసంగతి ఊరికెనే తెలిసి పోతది

వీరయ్య :— ( ఆలోచించి ) తిరుపతయ్యా ! నువ్వు పల్లెటూళ్లో ఉంటున్నా ఆలోచనలుమాత్రం బస్తీకి తగ్గట్టున్నాయి. సరే కాని మరి మా నాయన ఏమని కొప్పుకుంటడంటవ ?

తిరుపతయ్య :— అదంత నీకెందుకు ? నువ్వు సరేనంటే అయిపాయె. ఆనిక్కి నేను చూసుకుంటగా !

రఘు :— (కోటు విప్పుతూ) అందుకేనా వేషం వేసి బయలుదేరుతున్నావు, పట్నంమీద దాడికి.

వీరయ్య :— (బూట్ల దారాలు విగదీస్తూ) లేకుంటే మనస్తిమితం ఉండదు. ఏంచేయాలె.

రఘు :— సరేగాని ఎట్లా గడుస్తున్నాయి రోజులు ?

వీరయ్య :— రోజులకేం, దాగానే నడుస్తున్నాయి.

రఘు :— ఎట్లైనా నీవు పెట్టి పుట్టిన వాడివి.

వీరయ్య :— మా మామ ఓ ఉత్తరం రాశింది. విషయాలు చాలా ఉన్నాయి. కొడుకును, ఇంకెవరినో రాయబారం పంపుతాడట.

రఘు :— అ॥ హా॥ మీ మామ ఎందుకింత తొందర పడుతున్నట్టు ?

వీరయ్య :— అది వాళ్ళకున్న అలవాటే. పుట్టగానే పెండ్లి, పెండ్లి కాగానే పిల్లలు.

రఘు :— అయితే నీవేమంటవు ? నికరంగా ఇరవై అయిదు సంవత్సరాలు బ్రహ్మచర్యం గడిపి, తర్వాతగాని పెండ్లి చేసుకుంటే దాగుంటుందనా ?

వీరయ్య :— ఈ విషయంలో నాకో అభిప్రాయం లేదుగాని, ఈ పెండ్లిండ్లు, ఈ బొమ్మలాంటి జీవితం నాకేమీ బాగనిపించడం లేదు.

రఘు :— మరి ఎట్లా బాగుంటుందో చెప్పు. అది బాగలేదు. ఇది బాగలేదు అంటే ఎట్లా ?

వీరయ్య :— మంచేమిటో చెప్పలేనివాడు చెడ్డను, చెడ్డ అనకూడదా ?

రఘు :— అదికాదు నన్నొక బాధ వేధిస్తున్నది! నీ బాధలు నీవు చెప్పుకుంటున్నావు. నేను చెప్పుకోవడంలేదు. అంతే నీకు, నాకు తేడా.

వీరయ్య :— నీకు నావంటి బాధేనా ? అయితే ఇద్దరం ఒకటే అగ్నిలో బాగానే చేరుకున్నాం.

రఘు :— నీబాధ నీవు తీర్చుకుంటే తీరిపోతుంది. కాని నా బాధలు వంటిది కాదు. గడ్డు సమస్య. దాని పరిష్కారం కోసం ఒక నిర్ణయానికి రాలేక పోతున్నాను.

వీరయ్య :— సరేగాని బయటకువెళ్దాం వస్తావా రావా ?

రఘు :— వెళ్దాంగాని, కొద్దిసేపు కూర్చో. (విచారంగా తల నేలకు వేస్తాడు)

వీరయ్య :— ఏమిటి రఘు ! విచారంగా ఉన్నావు ?

రఘు :— చెప్తాను.

వీరయ్య :— ఖులాసాగా కాలం గడిపే విద్యార్థి దశలో ఏమిటోయ్ నీ గంభీరం. ఎట్లా అయ్యేది అట్లా అవుతుంది. నీవేమి అధైర్య పడకు.

రఘు :— ఊఁ చాలా ధైర్యంగా మాట్లాడుతున్నావు. సంతోషం. అయితే విను. నాకో తమ్ముడున్నాడు. వాడికి చాలా చిన్నప్పుడే పెండ్లైంది. ఇప్పుడు తన భార్యకు కూడా చదువు చెప్పించాలని వాడి పట్టుదల.

వీరయ్య :— అది అసంభవమని నా అభిప్రాయం.

రఘు :— కాని అత్త మామలు ఒప్పుకోవడంలేదు. దాంతో వాడికి మనసు విరిగి పోయింది. ఆ పెండ్లాం అక్కరలేదట. చదువుకున్నదాన్ని పెండ్లి చేసుకుంటాడట.

వీరయ్య :— అది అసహ్యైన పని

రఘు :— నేను చెబుతున్నదేమిటో సరిగా వింటున్నావా ?

వీరయ్య :— అయ్యో ! వినకేం, ఆదే చదువుకున్నదాన్ని పెండ్లి చేసుకుంటా నంటున్నాడు మీ తమ్ముడు.

రఘు :— రెండో పెండ్లి ఏ విధంగా నీకు బాగనిపించింది ?

వీరయ్య :— పాతకాలంవాళ్ళ రోగం తిరగాలంటే ఇదే మందు.

రఘు :— తల్లిదండ్రులు చేసే తప్పులకు శిక్ష అనుభవించేది పెండ్లైన పిల్లలా ?

వీరయ్య :— మరి తల్లి దండ్రులకు తమ పిల్లల విషయం ఆలోచన లేక పోయినప్పుడు మనమేం చేస్తాం ?

రఘు :— అదే ఆలోచిస్తున్న. నా తమ్ముడు బాగానే ఆలోచించాడు భార్యను చదివించాలని, కాని అది సాగక పోయేవరకు మూర్ఖుడుగా ఆలోచిస్తున్నాడు.

వీరయ్య :— చదివించడానికి తలిదండ్రులు ఒప్పుకోనప్పుడు ఎవరు మాత్రం ఏం చేస్తారు ?

రఘు :— అదేమరి, కష్టమనిపించిన వాటన్నిటితో మూరంగా ఉంటే వాటంతటవే అవే పరిష్కారం మవుతయా ?

వీరయ్య :— కావనుకో, కాని అవస్థలు ఉన్నవాళ్ళు అనుభవిస్తుంటే లేని అవస్థలు నెత్తిన వేసుకోవడం ఎందుకు చెప్పు ?

రఘు :— తప్పో, ఒప్పో, ఏదో జరిగి పోయింది దాన్ని ఓ మార్గంలో పెడ్తే బాగుంటుంది కద !

వీరయ్య :— ఈ గుదిబండలను మెళ్ళో వేసుకొని అవస్థ పడ్డదానికంటె చదువుకున్న ఒక అమ్మాయిని పెండ్లిచేసుకుంటే హాయిగా కాలం గడిచి పోతుంది.

రఘు :— నీవు ఊహించే ఆ హాయి ఎన్నాళ్ళుంటుందో నేను చెప్పలేను కాని మరి పెండ్లాడిన ఆ అమ్మాయి గతేమంటావు ?

వీరయ్య :— ఎవరి హాయిని వారు చూసుకుంటారు అంతే

రఘు :— అయితే ఈ విధంగా నీవు, నా తమ్ముడు ఒకే విధంగా ఆలోచిస్తున్నారు.

వీరయ్య :— నీ తమ్ముడు ఆ అమ్మాయిని చదివించాలనే లక్ష ఒకటి పెట్టుకున్నాడు. నేనటువంటి అమాయకుడిని కాను.

రఘు :— అయితే మిమ్మ పెండ్లి చేసుకున్నవారి గతి ?

వీరయ్య :— ఏమైనా కావచ్చు కాని నాకుమాత్రం వాళ్ళ విషయంలో సానుభూతి లేదు.

రఘు :— బాగుంది. కేవలం పేరుకోసం బాల్యవివాహాలు చేస్తే తలిదండ్రులను మనం అజ్ఞానులంటున్నాము కదు!

వీరయ్య :— అసలు మేమిటి ? అజ్ఞానులే.

రఘు :— మనమంతా జ్ఞానులం, అవునా ?

వీరయ్య :— వాళ్ళకంటే వేయిరెట్లు.

రఘు :— మన జ్ఞానం, ఆ అజ్ఞానుల కేమైన దోవ చూపిస్తున్నట్టా ?

వీరయ్య :— ( మాట్లాడడు )

రఘు :— అజ్ఞానులైన తల్లిదండ్రులవల్ల వారి సంతానం, వాండ్లతోపాటు జ్ఞానులమైన మనం అవస్థలకు గురి అవుతామనికదా మన వాదం ? అయితే మన జ్ఞానంతో ఆసంతానం ఏవిధంగా సుఖపడుతున్నట్లు ?

వీరయ్య :— నీవు ఆ పెళ్లైనవాళ్ళవైపు వాదిస్తున్నావు.

రఘు :— చదువుకున్నా. చదువుకోక పోయినా మంచి, చెడ్డల విచక్షణ మాత్రం ఒకే విధంగా జరుగుతుంది.

వీరయ్య :— రఘు! నీ తమ్ముని సమస్యతెచ్చి నన్ను అనవసరంగా వేధిస్తున్నావు.

రఘు :— మీరిద్దరు చేస్తున్నపని ఒకటే కాబట్టి.

వీరయ్య :— అయితే ఏమంటావు ?

రఘు :— తలిదండ్రుల అజ్ఞానానికి బలియైన సంతానం గురించి కొంచెం ఆలోచించమంటున్నాను.

వీరయ్య :— ఆలోచించి ఏంచేయమంటావు ?

రఘు :— ఇంకా ఏం చెప్పను ?

వీరయ్య :— (గడియారం చూచి) రఘు! నేను తొందరగా వెళ్ళాల్సి ఉంది.

రఘు :— ఆ తొందర పనులు నాకు తెలుసు. నీ మనసును వంచించి, బయట పడ్డామని చూస్తున్నావు.

వీరయ్య :— రఘు! ఇన్నాళ్ళనుండి నాతో కలసి మెలసి ఉన్నందుకా నా స్వంత విషయాల్లో జోక్యం కలిగించు కుంటున్నావు?

రఘు :— నీ స్వంత విషయమే. నేను కాదనను, కాని నీవు నా స్వంత తమ్ముడివని భావించి మాట్లాడుతున్నాను.

వీరయ్య :— (పరీక్షగా రఘుని చూచి) మొదట నీ తమ్ముడి విషయం ఆలోచించుకో. దాన్ని నీవు సాధించితే, తర్వాత నా సంగతి చూసుకుందాం.

రఘు :— (వీరయ్య చేతులు పట్టుకొని) నిజం చెప్తున్నా. నాకు నీవు తప్ప వేరే తమ్ము లెవరూ లేరు. నా బాధంతా నీ కొరకే.

వీరయ్య :— రఘు! ఏమిటిది, నాటక మాడ్తున్నావా?

రఘు :— ఏమైనా అనుకో! నేను మీ మామ ఊరినుంచే వస్తున్నది. మీ మామ స్థితి, మీ అత్త ఆవేదన చూచి నా మనసు నీరై పోయింది. అమాయకుడు గంగయ్య ఆడదానివలె కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు.

వీరయ్య :— ఆఁ. మా అత్తవారి ఊరు వెళ్ళినావా?

రఘు :— పోగా మిగిలిన ఒక్క బిడ్డను నీవు బుద్ధిమంతుడవని, చదువు కుంటున్నావని నీకిచ్చి పెండ్లి చేసినారు. కాని నీవు మూర్ఖుడివై ఆ పిల్లగొంతు కోయ చూస్తున్నావు. చదువుకున్న మనం పాత కాలం వాండ్లు కండ్లు తెరిచేటట్టు ప్రవర్తించాలి. లేకుంటే చదువు లంటే గౌరవం లేకుండా పోతుంది.

వీరయ్య :— ( సందిగ్ధావస్థలో అటు, ఇటు తిరుగుతాడు. చేతి గడియారం విప్పుతాడు. ముఖం చీదరించుకొని కుర్చీపై ఆలోచిస్తూ కూర్చుంటాడు. )

రాము :— నేను వచ్చేవరకు ఉండు! స్నానంచేసి వస్తా. బయటి కెళ్దాం.

( వెళ్తాడు. తెర పడుతుంది. )

## మూడో రంగం

( తెర ఎత్తేవరకు మల్లయ్య చుట్టను చుట్టుకుంటాడు, ఇంతలో లింగయ్య వస్తాడు. )

లింగయ్య :— ఏం మల్లన్న! ఎటో బయలుదేరినవు!

మల్లయ్య :— ఏం చెప్పాలె లింగయ్య. ఇంటికాడ కూసుంటే చికాకేస్తుంది. ఉండలేక ఇటొచ్చాను.

లింగయ్య :— మీ వియ్యంకుడు కొమురయ్య వస్తడంటివి, మరి యింకా రాలేదే?

మల్లయ్య :— అవును లింగయ్య! వస్తాడట. ఆయన ఏం గంద్రగోళం చేస్తాదో ఏమొ!

లింగయ్య :— నేనున్నాలే. నీవేం భయపడకు. నిలదీసి గట్టిగా అడుగుతాలె.

మల్లయ్య :— కాని ఆ తిరుపతయ్యలేడు, వాడితో వచ్చింది తిప్పలు లింగయ్య. మా కొమురయ్య బావ వాడేదంటే అదే పట్టుకుంటాడు. కొడుకు పట్నంగాలి తగిలి పట్టపగ్గాల్లేకుండ ఎగురుతుంటుంటే తండ్రికైన బుద్ధి ఉండొద్దు. ఏంకాల మొచ్చింది లింగయ్య! కొమురయ్యబావ తల్చుకుంటే కొడుక్కు బుద్ధి చెప్పలేడంటావా?

లింగయ్య :— ఇయ్యాల రేపు పోరగాండ్లు భలే నడమంత్రపోళ్ళు మల్లన్న. ఎటుపడితే అటె.

మల్లయ్య :— రంగయ్యా! మనలోమాట, పెండ్లి చేసుకున్నాడు వద్దంటే బెదరి పోతదా? ఏంరోజు లొచ్చినయే.

రంగయ్య :— కొమరయ్యకు ఓ బిడ్డ ఉంటే తెలసొచ్చు నీ తిప్పలు.

మల్లయ్య :— యీరయ్య సదువుకున్నాడుగద! యీకొద్ది తెలిసుంటాద్దు

రంగయ్య :— కొమరయ్య వస్తడుగద, రంగేందో తెల్సుకుందాం.

మల్లయ్య :— రంగయ్యా! నీకు దండం పెడ్త. యీవారం మాత్రం బెడసకుండ సూడాలె మరి. ఏమ్లేదుగాని మనం రోశాయిపడ్తే, పిల్లమ్మ బయిను బండరై పోతది.

రంగయ్య :— కాని మల్లన్నా! మనం మెత్తబడితె కొమరయ్య రొమ్మెక్కి కూసుంటడు

మల్లయ్య :— అవును, పిల్లగానోళ్ళంటే అంతేగద మరి

రంగయ్య :— చూడు! నేనొకమాట చెప్త. వాడు పోరింటే పదిమంది పెద్దమనుషుల ముందర సచ్చెప్పమని నిలదీసి అడుగుత

మల్లయ్య :— అట్ల బాగుండదు రంగయ్యా! మనం, మనమే రచ్చకెక్కితే ఏం బాగుంటది చెప్పు? రంగయ్యా! ఓసంగతి చెప్పమరిచిన. మొన్న మా అల్లుని దోస్తూ ఒకడొచ్చిండె. ఇద్దరూ ఒకటే అర్రలో ఉంటరట.

రంగయ్య — వాడెవడో నీ అల్లునిజుట్లోంచి వెళ్ళనోడుంటడు.

మల్లయ్య :— కాదు రంగయ్యా! బలే మెమ్మదిమనిషి అనిపించిండు. నేను చెప్పిందంతా మన్సుపెట్టి యిన్నడు.

రంగయ్య — మరి నీ అల్లుని తైతక్క యేశాల సంగతి అడగలే.

మల్లయ్య — అడిగిన్నునో. నేన్ చెప్పుతుంటే యిన్నదేకాని ఎంత కుచ్చి, కుచ్చి అడిగినా ఒక్కమాటన్న చెప్పిండనుకున్నవా!

రంగయ్య :— నేం చెప్పతేమరి? వాండ్లంతా ఒకటే, నీపిచ్చిగాని.

మల్లయ్య :— కాని లింగయ్యా, పోయేటప్పుడుండే, నీవేం భయపడ కన్నడే. అనే నాకు జబ ధైర్యంగుంది.

లింగయ్య :— నీమనస్సుం తెలుస్కుకుందామని నీ అల్లుడే పంపుంటడని నా అనుమానం.

మల్లయ్య :— అంతేనంటవా. ఏమన్యాయం అయిపోయిందే రాగ, రాగ కల్జుగం, గల్జుగమంటే ఇదేగావుమాయి.

లింగయ్య :— అట్ల గుండెపగిలితే బ్రతకటం కష్టం మల్లన్నా, అయిన దానికి నిబాయించాకొని ఉండాలె

మల్లయ్య :— నువు బలెగ మాట్లాడతవుగాని నాకేమన్ని చూస్తుంటే ఈ జీవుడు వెళ్లిపోతే బాగనిపిస్తది.

లింగయ్య :— (దోవలికి చూస్తు) అగో! కొమరయ్య, తిరుపతయ్య వస్తునే ఉన్నరు.

మల్లయ్య :— నిజంగంటున్నవ, తిరుపతయ్యగాడా వస్తున్నడ? (దోవలికి చూస్తాడు)

(కొమరయ్య, తిరుపతయ్య ప్రవేశం)

మల్లయ్య :— రావా. రావు, రా రా తిరుపతయ్యా, రా. అంతా బాగున్నరేనా, లింగయ్య పట్నంలో బాగున్నాడా?

తిరుపతయ్య :— నీవు మూటలకు మూటలు పంపుతుంటే ఎందుకు బాగుండము?

కొమరయ్య :— నీవేడ కూసున్నవు బావ! మంచిదైంది కట్టపొంటె పోతే నువు తలవక పోదువు ఈసంగొచ్చిందే బాగైంది.

లింగయ్య :— కొమరయ్యను చూడక చానా రోజులాయె పాపం! మనిషి గుర్తుపట్టకుండైంది.

తిరుపతయ్య :— సుఖ మెప్పుడువులాగుంటె ఎట్లుంటది మరి?

మల్లయ్య :— నిలబడితివి బావా, కూచో. నువు ఎన్నవనే యెదిరి చూస్తున్నం. అప్పటాలనించి నీసంగతే మాట్లాడుకుంటున్నం.

రంగయ్య :— కొమరయ్య! మీరేమనుకోకపోతే నేనొకటి అడుగుత.

తిరుపతయ్య :— ఒకటేమిటి, ఇష్టమొచ్చినన్ని అడుగు.

మల్లయ్య :— (కొమరయ్యా, తిరుపతయ్యా ముందర పొగాకు వేసి) జర దమ్ము తీసుకోనీయి రంగయ! నడిసి నడిసి వచ్చిన్రు. చుట్టకాల్చురి.

కొమరయ్య :— (చుట్ట కాడలు తీస్తూ) బావ! నేనెందుకొచ్చిన్నో నీకెరికే గద! నేను జరిగిన యన్ని తోవ్వాలని చెడ్డనిపించుకొనట మెందుకు?

రంగయ్య :— మీరిద్దరు అనుకోంగనే అయిపోదు. ఊళ్ళో మంచి, చెడ్డ తెలిసినాళ్ళు ఉన్నరు.

తిరుపతయ్య :— మేము మంచి చెడ్డ మంచిగ ఆలోచించుకొనే వచ్చినం.

కొమరయ్య :— నా మంచి చెడ్డలు నాకు తెలుసును సంసారం చేసే మొగుడికే ఇష్టం లేనపుడు నేనేం జేస్త? నీ బిడ్డను తీసకపోయి వాడి కాలుకు కట్టేయ మంటరా పెద్దలు?

రంగయ్య :— లోకంమీద ఎక్కడ పెండ్లిండు పేరంటాలు జరగనట్లే చెప్ప బట్టివి.

తిరుపతయ్య :— ఇసుంటి పెండ్లిమాత్రం కాలేదు.

మల్లయ్య :— బావ! మన పిల్లలకు మనం బుద్ధి చెప్పుకోకపోతే ఇంకెవరు చెప్తారు? నువు చెప్తే వీరయ్య యినడా చెప్పు?

కొమరయ్య :— (రంగయ్యను చూపుతు) ఆ సంగతి ఆ మనిషికి చెప్పు, ఎవరో పెద్ద మనుషులున్నారట పంచాయితీలు చెప్పదానికి.

మల్లయ్య :— దీంట్ల కోపమెందుకు బావ, ఆయన మన మంచికే అన్నడు. గిట్లకంటున్నవ?

తిరుపతయ్య :— ఆఁ. ఇందాక జరిగిన మంచి చాలు.

కామయ్య :— పల్లయబావ, సాఫ్‌గచెప్తున్న, మా యీరయ్య ఉన్నదే ఓండ్ల మాటలు యినేటోడు కాడు. వాడన్నట్లా సాగించుకుంటడు. నీ కోసమని, నా కడుపున పుట్టిన కొడుకుతో కంటుబెట్టకో మంటవా ?

తిరుపతయ్య :— నీవేంది కామయ్య, ఎవరైనా అదే చూసుకుంటరు. ఎడ్డిపిల్లను పెండ్లిచేసి అందరిని దగా చేస్తిమని అనుకుంటున్న వేమో !

పల్లయ్య :— ఎవరు ? నాబిడ్డ పుల్లమ్మ ఎడ్డిదా ?

కామయ్య :— అదంతెందుకు ? ఎడ్డిదిగాని గుడ్డిదిగాని. పెండ్లి అయిందో లేదో, పట్నం పోయిందుగద మా యీరయ్య. అప్పట్నుంచే వాడెందుకో మన్సు మార్చుకున్నడు అనేందో గాని పెండ్లాం మాటెత్తితే మండిపోతున్నడు.

లింగయ్య :— ఎందుకు మండదు, పట్నం ..

పల్లయ్య :— ( *లింగయ్యను వారించి* ) ఎత్తు ఒంపులు తెలియని పిల్లలు బావ, వాండ్లు. వాండ్లను దోవకు తెచ్చుకోవాలె బావ.

తిరుపతయ్య :— అయితే నీ కోసమని సదువుకుంటున్న బంగారంవంటి పిల్లగాడిని చెడగొట్టు కుంటామా ?

లింగయ్య :— అయితే ఇంతకు మీ మన్సులో మాటేంది ? సంబంధం వదులుకుంటమంటావు. అంతేనా ?

కామయ్య :— పెండ్లి చేసుకున్న మొగుడు వద్దంటుంటే నన్నేం చేయ మంటరు ?

లింగయ్య :— రేపు నీకొడుకు పట్నంనించి ఓ బజారుముండనుతెచ్చి నా పెండ్లాం అంటడు, ఒప్పుకుంటవా ?

తిరుపతయ్య :— బలే తెలిసినోడోలె మాట్లాడబట్టివి. సరే, మా యీరయ్య చెడ్డోడె. అసుంటోడితో మీకేం పని? మీదారిమీది, మావారిమాది.

మల్లయ్య :— నా అల్లుణ్ని ఎవరు ఏమన్నా, నా అల్లుడు. ఏమైనా యీరయ్య నా అల్లుడు. ఇది మాత్రం అబద్ధం కాదుగద బావా!

కొమరయ్య :-- నువ్వు నేను అనుకోంగనే అయిపోతదా? మరి అస లేంటి సంగతి?

మల్లయ్య :— జర నిదానించి మాట్లాడు బావా! నాకు పెచ్చి లేచేటట్టుంది

తిరుపతయ్య :— మాటకు, మాటపెరుగుతుంటే ఎవరికైనా అట్లనే ఉంటది మరి, అందుకోసం మాటలొద్దు, పోట్లాటలొద్దు. పెండ్లప్పుడు పెట్టిన సొమ్ము లీవల పారెయ్యి. మాదోవన మేము పోతం.

మల్లయ్య .—అపునా బావ, అంతేనంటవ. ఇందుకేనా బావ ఇంతపూర మొచ్చింది? నా గొంతుపిసికి చంపేయరాదు బావ.

రంగయ్య .— కొమరయ్యా! దాగావిను. ఇది మీదిఅనుకోకు, అను కున్నట్లా సాగిరావడానికి. నువు చేస్తున్నది తప్పని, పదిమం దితో చెప్పి మెప్పిస్త, ఏమనుకున్నవో.

కొమరయ్య :— వినేవాడుంటే చెప్పి మెప్పిచ్చు

రంగయ్య :— అన్నిటికి కొడుకును అడ్డమేసుకొస్తున్నవుగద, ఆ కొడు కుతో మాట్లాడి ఆ సంగతేంటో తెల్సుకుంటాం పోండి, మీతో మాకేం పనిలేదు.

తిరుపతయ్య :— అడుగొచ్చు. మాకేం భయం లేదు.

కొమరయ్య :— నన్నుకాదని నాకొడుకు ఒక్క అడుగేయడు ఎరికేనా?

మల్లయ్య :— ( ఆవేదనతో ) అయినప్పుడు కొడుకుకు నచ్చచెప్పితే అయిపోతదికద బావ?

రంగయ్య :— మల్లయ్య, ఇంకేం తేలిపోయింది. ఇదంతా కొమరయ్య చేస్తున్నదే.

తిరుపతయ్య :— అవును. ఎవరిమంచి వాళ్ళు చూసుకుంటరు. ఎవరివాండ్లకు వాళ్ళు చెప్పుకుంటరు.

కొమురయ్య :— ఏమన్న అనుకోండి. మాకు మాత్రం మీ సంబంధం అక్కరలేదు.

మల్లయ్య :— ఎప్పటిదో పగ యెళ్ళతీస్కుంటన్నవు బావ.

కొమురయ్య :— ఇప్పుడు యాది కొచ్చింది, నువు మరిచినవనుకున్న.

రంగయ్య :— ఏందది ?

మల్లయ్య :— కొమురయ్యబావకు చచ్చిపోయిన మా రామక్కను ఇచ్చి పెండ్లిచేసినపుడు చెరువుకింది కొత్తలపొలం మాఅయ్య అరణం ఇస్తనన్నడు. ఏమైందో ఏమో భూమి ఇయ్యలేదనుకో. ఇంతట్లనే మా రామక్క చచ్చిపాయె. అంతా గందరగోళమైంది,

రంగయ్య — ఆ పొలం కరణమోరిదేమొ !

మల్లయ్య :— అసలు మొదట మాదే, ఆనెక్క కరణమోయన గుంజుకున్నడు.

తిరుపతయ్య :— ఎంగిలి తింటి అరుగుతాది మరి ?

రంగయ్య :— మీబావ తెలివితక్కువోడేంగాదు.

తిరుపతయ్య :— తెలివితక్కువోడని కదు, ఎడ్డి పెల్లను అంటగట్టి ఎగిరి గంతులేస్తున్నడు ?

కొమురయ్య :— బావా ! ఇంతకూ ఏమంటవు ? నగ, నట్ర రూపెల పాతే స్తవా లేదా ?

(వీరయ్యా, రఘు ప్రవేశిస్తారు.)

మల్లయ్య :— వచ్చినావు కొడుక ( *కౌగలించుకుంటాడు. రఘు వాళ్ళకు దండంపెడ్తాడు.* )

రంగయ్య :— ఏమయ్యోయ్ ! దొగున్నవా, గుర్తున్నమా ?

తిరుపతయ్య :— యీరయ్య మాత్రం సరిగ ఊడి పడ్డడు.

కొమరయ్య :— నదువు( సత్ర వదలిపెట్టి పుట్టి మునిగిపోయినట్టు ఉరి కొచ్చినవు ?

వీరయ్య :— అవునయ్యా ! మునిగిపోతున్నదనే వచ్చిన (రఘును చూపుతు) ఈయన నా స్నేహితుడు. నా కండ్లు తెరిపించిండు.

కొమరయ్య :— అయితే ఏందంట అ మునిగి పోతున్నది?

తిరుపతయ్య :— నీవేం భయపడకు కొమరయ్యా !

మల్లయ్య :— ఎందుకు తొందరి పడ్తావు బావ ! ఏం చెప్తాడో విందాం.

కొమరయ్య :— యీరన్న ! మనసులో ఉన్నదున్నట్టు కక్కేయి ! యింకా దాపరిక మెందుకు ?

తిరుపతయ్య :— ఏం భయపడకు.

వీరయ్య :— అవునయ్యా ! అందుకే వచ్చింది. నే నిన్నాళ్లు నీకు వ్రాసిన ఉత్తరాలు, చెప్పిన మాటలు మరచిపో అయ్యా.

కొమరయ్య .— అంటే ?

తిరుపతయ్య ·— యీరయ్యా ! ఏందిది ?

వీరయ్య :— నేను పుల్లమ్మను పెండ్లి చేసుకున్నా. నేను ఆమెకు భర్తను. అంతే. వేరే ఏమీలేదు.

కొమరయ్య :— వీరన్న ! నీదోస్తు నీకేదో మాయ చేశిండురా.

తిరుపతయ్య :— మాయనా, మాయనా, (రఘుతో) ఎవరయ్యా నువ్వు ?

రంగయ్య :-- పెండ్లి చేసుకున్న పిల్లను పెండ్లాం అంటుంటే మాయ అనిపిస్తున్నదా మీకు, మీరు మనుషులేనా ?

తిరుపతయ్య :— మాట సరిగారాని, పెద్దమనిషివైతె అయినవు గాని.

( *గంగయ్య ప్రవేశించి బావా అని వీరయ్యను కౌగలించుకుంటాడు* )

వీరయ్య :— మధ్యన నీకెందు కొచ్చిన తగాదా, పుల్లమ్మ నా పెండ్లాం అని చెప్పుతుంటే !

కొమరయ్య
తిరుపతయ్య } :— ఆ!

మల్లయ్య : — మనం అంతా ఇంటికి పోదాం. ఆడోళ్ళకు తెలిస్తేపండగ చేసుకుంటరు. రా బావా ! యింటికి పోదాం.

కొమరయ్య :— నేను నీ వాకిలి తొక్కను.

తిరుపతయ్య :— ఎంత మోసమాయె కొమరయ్య ?

( *కోపంతో ఇద్దరు వెళ్ళిపోతారు. వాండ్లవైపు మల్లయ్య దీనంగా చూస్తుంటగా తెరపడుతుంది* )





# మాయరోగం

---

రచయిత :

శ్రీ పల్లా దుర్గయ్య

జననం : 1916

నివాసం : హైద్రాబాదు

అభిరుచి : ప్రాచీన, ఆధునిక కవిత్వం.

రచనలు : అముద్రితం : తెలుగు నిఘంటువు, సాహిత్య విమర్శనలు, పద్యాలు, గేయాలు.

అభిమానరచయితలు : శ్రీనాథ, పెద్దనార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, రాయప్రోలు సుబ్బారావు.

చాదర్ఘాట్ కళాశాల తెలుగు ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు.



పాత్రలు :

సిద్ధాంతి

మల్లడు

పంతులు

మురళి

మోహన్

శ్యామసుందర్



కోడిని – మీ పాదాల్తోడు. అట్లా చీవిస్తే తలారి రావిణ్ణాయిపోతే – కూడులేక చస్తాం. వద్దు దాటూ వద్దు, కంట్రోలు కాలంకదా బాబయ్యా ఇది. అందుకని అన్నీ కంట్రోలులోనే ఉండాలి.

సిద్ధాంతి :– అయితే పేరు చెప్పు.

( ఓ ప్రక్క కుర్చీమీద కూర్చుంటాడు )

సేవకుడు :– మల్లిగాడు. దాంచెను, మా యింటిది కూసదుము ఊకె కట కట పెదుతోంది. ఉన్నదానికీ – లేనిదానికీ – ఒక్కటే పోరు – చప్పరించేస్తున్నది – గొంతుక. ( కించ కూమిండి ) అదుట్టం కాదా గిరగిరా గిరగిరా తిరుగుతోంది గిరకోలి.

సిద్ధాంతి .– ఒరే – మల్లడూ ! మా – మి – మూ – మే – మఖ. మఖ పుబ్బ ఉత్తరాఃపాదం సింహం – అంటే, నీది సింహరాశి. ( పంచాంగం తెరిచి ) ఇప్పుడు సింహంలో శని – అంటే ఏలినాటి శని – దానికి తోడు కేతువు కూడ –

సేవకుడు :– అద్బో – సనే – తోడు కేతు కూడానా సామి !

సిద్ధాంతి :– ఉండూ – చూడనీ – కుంభంలో బృహస్పతి – మీనంలో రాహువు. అంటే – సింహం – కన్య – తుల – వృశ్చికం – ధనస్సు – మకరం – కుంభం – మీనం – సరిగ్గా ఎన్మిది – అష్టమ రాహువు – ( నిదానించి చూస్తూ ) ఎన్మిదిట్లో రాహువు – రెండిట్లో శని – కేతువులు. ( తొందరతో ) ఐతే మల్లడూ – ఎలాగురా ! బతికున్నా వింకా !

సేవకుడు :– ( భయం నటిస్తూ దిగ్గున లేచిపోయి సిద్ధాంతిని కుర్చీతో పట్టుకొని కళ్ళు మూసుకొని ) ఆ( ఆ( బతికున్నానా ? బాబూ ( ఏడ్పుగొంతుతో వణుకుతూ ) ఇంకా బతికున్నానా ? – బతికున్నానా, చస్తున్నానా ? ఎల్లా బతికున్నాను సామి !

సిద్ధాంతి :– ఛీ – ఛీ – పసులు పసుయి – కూచో చెప్తా – ఆ( ( చిటికె వేసి ) తెలిసింది.

సేవకుడు :- (ఆశతో) చెప్పు సామీ చెప్పు. (చేతులు జోడించును)

సిద్ధాంతి :- గురు, రద్రి, ద్వినవ, పంచమే, శుభ ఫలదః - అంటే (నీది కుంభం అంటే) ఏడిట్లో గురువు. ఒరే - నీకు గురుబలం బాగున్నది. బృహస్పతి బలం చాలుండబట్టే బతికున్నావు. లేకుంటేనా ఈపాటికి జానెడు గరిక

సేవకుడు .- మొలిచేదా! సామీ! ఆఁ - ఐతే (చేతులు జోడించి పైకెత్తి) సల్లగ బతుకు - నా తండ్రీ - బురస్పతీ - నీకు దణ్ణాలు - సామీ!

సిద్ధాంతి .- ఐతే పిల్లడూ! రః శని రాహువులు నిన్ను ఊరికే పోనీరు. తిననీరు - తాగనీరు - పండనీరు - ఉండనీరు.

సేవకుడు .- ఆఁ, ఆఁ, అగు సామీ, అగు, బయమేత్తాంది.

సిద్ధాంతి :- విను, పిల్లడూ! మరేం భయంలేదు — వచ్చేశనివారం - సేరు నువ్వులు - సేరు మినుములు - సేరు పప్పు - రూపాయి పావలానగదు. స్నానంజేసి భక్తితో దానం చేశావంటే, నీ శని పీడ వదలి - నీ భార్య నువ్వు ఏ పోరులేకుండ వుంటారు సుఖంగా.

సేవకుడు :- తప్పుతుందా! వారు - మీరు చెప్పినాంకానా! ఐతె ఆ మాత్రం పుణ్యం - మీరే కట్టుకోవద్దూ? నన్ను రచ్చించాలె - ఎట్లాగో అట్లా.

సిద్ధాంతి :- మంచిది. భయపడకు మరేం ఫరవాలేదు - వచ్చి పిలుమకపో.

సేవకుడు :- చిత్తం - సామి (అని సంతోషమును ప్రకటిస్తు) నీకట్టం వుంచుకోను. బతికించాలె నన్ను.

(సిద్ధాంతి పొడుంకాయ తీసి పొడుం పీలుస్తుంటాడు. ఇంతలో లోపలి నుండి పంతులుగారు ప్రవేశిస్తారు.)

పంతులు .- సిద్ధాంతిగారికి నమస్కారాలు!

సిద్ధాంతి :- ఆఁ ఛీ. (లావుగ ఒక తుమ్ము తుమ్మి కొళ్లాయిపంచతో ముక్కు తుడ్చుకుంటు) మనోవాంఛా ఫలసిద్ధి రస్తు! ఆయుష్యమస్తు! (తుమ్మి) ఆరోగ్యమస్తు! పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు! ధనకనక వస్తువాహన ప్రాప్తిరస్తు!! గృహే కల్యాణమస్తు!!! (తుమ్మి ముక్కు తుడ్చుకుంటు వుంటాడు.)

పంతులు :- బాగున్నది సిద్ధాంతిగారు! ఆశీర్వచనాలు! ఆగకుండా తుమ్ములు! పేళాపాళా అంటు వుండవద్దా తుమ్ములకు.

సిద్ధాంతి :- మరేమనుకోకండి! పంతులుగారు! నశ్యములో సున్నం పాళా కొంచెం ఎక్కువయింది. ఘాటు సూటిగా కపాళానికి తగిలింది. అంతే!!

పద్యము :- జలుబుచేత, పడిసెముచేత, జబ్బుచేత,
ముక్కులో ధోతి కొనలు త్రిప్పుటముచేత,
మిరపపొడిచేత, నస్యంపు చురుకుచేత,
వచ్చుతుమ్ములు శుభఫల మిచ్చు నిజము!

అన్నారు శకునవేత్తలు. ఇంతేకాక:
తుమ్మిన తుమ్మిన శుభమగు,

అను వాక్యము అందరికీ తెలిసిందే కదా! కాబట్టి అనుమానం అణుమాత్రం కూడదు. విన్నారా! పంతులుగారు! పుచ్చుకోండి ఓరుగూడ మంచి ఘాటైన పొడుం. కమ్మని పరిమళం, కలాయి చేస్తుంది కపాళాన్ని! ఊఁ! పట్టండి. (అని తాను చిమ్మతో తీసికొని పొడుంబుఱ్ఱ పంతులు ముందుంచును. పంతులు పొడుం ఎక్కించి) సిద్ధాంతిగారూ! రాష్ట్ర ఉత్తరము చూడండి (అని లేఖ ఇచ్చును.)

సిద్ధాంతి :- (చిమ్మలోని పొడుం, ఎడమచేతిలో వేసికొని చేతిని ముక్కు ముందుంచుకొని, ఈ ముక్కుతో ఆముక్కుతో, శబ్దం వచ్చేట్టు రెండుమాట్లుపీల్చి అఱచెయ్యి తొడకు రాచుకొని కుడిచేత్తో ఉత్తరం అందుకొని గొణుగుతు లోలోన చదువుకొని తలవూపుతు) భేష్!

భేష్! బలే సంతోషం. శుభముహూర్తమే? ఏమండి! మన అద్బాయిగారికేనా వివాహం? పరమసంతోషం, కానీయండి, త్వరగా. 'శుభస్య శీఘ్రం' అన్నారు పెద్దలు! కాని ఇంతదాకా వచ్చేవరకు మాకే తెలియకుండా దాచారేం, పంతులుగారు!

పంతులు :- ఏం చెప్పేది! అంగట్లో అన్నీ ఉన్నై. అల్లునోట్లో శని న్నది. ఎన్నాళ్ళనుంచో, వాణ్ణో ఇంటివాణ్ణి చేద్దామని విశ్వప్రయత్నము చేస్తున్నాను, ఏంలాభం! వాడి కీసంగతే పట్టదు! గిట్టదు! ఇదేమి విపరీతకాలమో! ఎవణ్ణిచూచినా పెండ్లి పట్టదో అంటే పట్టదో — అని ఒకటే రోకటిపాట! చదువుకు పెండ్లికి లంకెట! చదువుకాంది పెండ్లి చేసుకోరట! విచిత్రం! మన రోజుల్లోనా? "వివాహో విద్యనాశాయ" అని ఉన్నా పెద్ద బాలశిక్ష చదివామో లేదో. అంతే! పెండ్లి అయిపోవలసిందే! ఎదురుచెప్పే దమ్ముండేదా మనకు? ఇప్పుడు వీళ్ళని కదిపితేచాలు 'మాపెండ్లి మాయిష్టము' అంటారు. కష్టం నష్టం తెలియని వీళ్ళకో ఇష్టమట, ఇష్టం! ఏదో మనమున్నాము కనుక, ఆరాటము చేస్తాముంటే పట్టదో అంటారు. తమకు తెలియదు, మనము చెప్పితే వినరు — తర్వాతనా! కావాలో అని అరిస్తేమాత్రం ఎవరిస్తారు వీళ్ళకు పిల్లను?

సిద్ధాంతి :- ఔను! పంతులూ! అక్షరాల నిజం.

పంతులు :- మంచి సంబంధం, జమీందారింటపిల్ల, గొప్ప వరదక్షిణ! ఎన్ని విధాలచెప్పినా, సరే అనడు కదా వెధవ! ఇంతవరకు నయాన చెప్పిచూచిన. ఫలితము శూన్యం. ఈసారి భయాన్నైనా సరే ఒప్పించి రెండు కొంగులు ముడివేసి తీరుతా.

సిద్ధాంతి :- చేయాల్సిందే, తప్పకుండా! అలా చేయాల్సిందే! ఒట్టి మాటలతో వింటారా వీళ్ళు. ఇంతలేరు! అన్నీ మాకే తెలుసు అంటారు! సర్వజ్ఞత్వం! సంగీతానికి చింతకాయలు రాలుతాయా యెక్కడైనా?

పంతులు :- అంతేనంటారా ! సిద్ధాంతిగారు ! మీ అభిప్రాయము కూడ అంతే కదండీ ! భేష్.

సిద్ధాంతి :- ఏం చెప్పేది ! విసిగిపోయాను తిరిగి తిరిగి నడుం విరిగి - కాళ్ళరగి - కంఠ కరిగి - మనస్సు మరిగి పోయింది. ఒక్కక్షణంరైనా వింటేనా ! నూరబద్ధాలాడైనా ఒక్క పెళ్ళి చెయ్యమన్నారని నలుగురైదుగురి విషయంలో జోక్యం కలిపించుకొని సంబంధాలకని తిరిగితే, అంతా ఒకటె మాట, అంతా ఒక్కటె ! వీళ్ళ చదువులేమో - వీళ్ళేమో ! వినండి !

"చక్కని అమ్మాయి, చదువుకున్న అమ్మాయి,
పాటలు పద్యాలు పాడగల అమ్మాయి,
వేదికపై కెక్కి వాదించు అమ్మాయి,
'ఫేసు' (Face) పై పౌడర్లు వేసుకొను అమ్మాయి,
వ్యాసులెన్ పోవ్లి లన్ని వాడగల అమ్మాయి,
ఆడగల అమ్మాయి, పాడగల అమ్మాయి.

ఇంకా ఏమిటేమిటోనట —

అట్లాంటి అమ్మాయి కావాలట ప్రతి వాడికి ! పైగా ఏమో Love అట ! Marriage అట! వాటి మొహమట ! పిండా కూడట ! ఏడిపించారు నన్ను. హేళనచేసి పంపించారు. విన్నారా ! పంతులూ !

పంతులు :- ( పెద్దగ నవ్వుతూ ) బలే బలే పాటలు నేర్చారే సిద్ధాంతి గారు ఏదీ ! మళ్ళీ !

సిద్ధాంతి .- కాదండి, ప్రతివాడి పల్లవి వినీ వినీ నోటిపాఠై పోయింది. అంతేకాని వీళ్ళ మూలాన ఎదిగిన అమ్మాయిలు యెందరు పెండ్లి - పెడాకులు లేక ఏడుస్తున్నారు? చదువు రానంత మాత్రం చేత వాళ్ళలా పెళ్లిలేక ఉండవలసిందేనా, జన్మంతా !

పంతులు :- బాగా చెప్పారు సిద్ధాంతిగారు. వీళ్ళు పెళ్ళిచేసుకొనేదే నమ్మకంలేదు. అథవా ! చేసుకున్నా ! కొనదాక సంసారం చేసేది అంతకంటే నమ్మకంలేదు. కాపురం చేస్తే పిల్లల కంటా రనీ వంశం నిలుపుతారని మరీ నమ్మకంలేదు. కాలం తలక్రిందు లైంది. పూర్వం మగవాళ్ళకు పెళ్ళిగాక ఎందరో ఉండిపోయే వాళ్ళు. ఇప్పుడో ఆడవాళ్ళకు ఆగతి పట్టింది ఆడవాళ్ళకు ! గడ్డిగరుస్తున్నాడు బిడ్డలగన్న తండ్రి ! వీళ్ళ గుణాలు చూచే నేమో ప్రభుత్వం కూడ, నేడు ఆడపిల్లలకు కూడ తండ్రి ఆస్తిలో భాగం యివ్వాలని, విడాకులు ఉండాలని శాసనం చేయ బోతున్నది. ఏంచేస్తారు లేకుంటే !

సిద్ధాంతి :- అవును పంతులుగారు. మను ధర్మశాస్త్రం, మనధర్మశాస్త్రంగా మారిపోతోంది ఈ కుట్టుకుంకల మూలాన్న.

పంతులు :- పోనీండి మనకెందుకు ఆ గొడవలన్నీ. ఈసారి ఎల్లా వినదో చూస్తాను. మీరైతే పీటలైనంత దగ్గర్లో ఓ మంచి ముహూర్తం చూచి పెట్టండి. ఈపెళ్ళి చేసే తీరుతాను.

సిద్ధాంతి :- మంచిది. తలపు ప్రకారం చేస్తాను. ( *పంచాంగం చూచి* ) వచ్చేనెల మొదటి తేది సరిగ్గా 9 గంటలకు మంచి సుము హూర్తం వున్నది. బంగారువంటి ముహూర్తం.

పంతులు :- మంచిది మళ్ళీ కలుసుకుందాం.

సిద్ధాంతి :- చిత్తం వెళ్ళి వస్తాను. అనుగ్రహం వుంచాలె.

పంతులు :- ( *దక్షిణ తాంబూలము చేతికిచ్చి నమస్కారము అనిలేచును చెరోదారిగుండా ఇద్దరు నిష్క్రమింతురు.* )

[ తెరవాలును. ]

## రెండో రంగం

[తలపట్టుక కూర్చొని విచారంతో ఆలోచిస్తుంటాడు పంతులుగారు.]

పంతులు :- (తనలో) నాకంతా కల చుట్టుకున్నట్టున్నది చూడబోతె. లేకుంటే అంతా సిద్ధమైన తర్వాత ఈ గ్రహచారమేమిటి? ఒక్కగాను ఒక్క కొడుకు. మహావైభవంగా వివాహము చెయ్యాలి. మంచి సంబంధం సాధించి, తీరా ముహూర్తం పెట్టు కున్నాక ఖర్మం యీలా కాలాలా? అదేం మాయరోగమో! రాచవైద్యుడికీ, భూతవైద్యుడికీ, డాక్టరుకీ, ఎవడిచేతికి చిక్కిన, పేల్చి పిప్పి చేస్తున్నది పిల్లవాణ్ణి. మరీ మూడు రోజుల్నుంచి నిద్రాహారాలు సుతరాం లేవుకదా. ఒక్కటే పలవరింతలు. పాటలూ, పద్యాలూ, ధ్యానం — మన ఊసేలేదు బొత్తిగా. పిలిస్తే చూడడు. చూసినా పలకడు. పలికినా అంతా అపస్మారమే! భయం వేస్తూంది. అన్నీ దోష లక్షణాలే! ఏం తోచకుండా ఉంది. ఏపని వివాహం తలపెట్టినానో అన్నీ విఘ్నాలే. పిల్లవాణ్ణి చూప్పించేవరకు తలప్రాణం తోకకు వచ్చింది. తుమ్మల సిద్ధాంతి గారి ముహూర్తం — అబ్బాయి జబ్బు! అంతా అయోమయంగా ఉంది! ఈ ముహూర్తానికే తప్పకుండా లగ్నం చేస్తానని మాట ఇచ్చాను వాళ్ళకు. వివాహంమాట యెట్లావున్నా అబ్బాయి బ్రతికి బాగుంటే చాలు! అదే పదివేలు! వాడేమన్నా ఐతే నాగతి యేం కావాలె!! (దుఃఖము నటించును.)

(క్యాం, క్యాం అని బయట విలువు.)

పంతులు :- ఎవరునాయనా! లోపలికిరండి —

(మురళీ, మోహన్ అను ఇద్దరు కాలేజి విద్యార్థులు ప్రవేశింతురు.)

మురళీ :- నమస్కారం పంతులుగారు!

మోహన్ :- Good morning Sir.

పంతులు :- రాండి, రారా, కూర్చోండి.

ఇద్దరు .- మూడురోజుల్నించి శ్యాం కాలేజికి రావటంలేదేమండి ? ఓ మారు కలిసి పోదామని వచ్చాం, ఉన్నారా ఇంట్లో ?

పంతులు :- అయ్యో నాయనా ! ఏం చెప్పేది. మీ శ్యాం ఆరోగ్యం బొత్తిగా బాగులేదు.

మురళి :- ( ఆదుర్దాతో ) ఆఁ ఆఁ ఏమన్నారు ? How is it possible!

మోహన్ :- మొన్న బాగున్నారు కదండీ !

పంతులు .- ఔను, నాయనా ! కాని ఇప్పుడు గదిలోంచే బయటరావటం లేదు.

మురళి :- Really ! We are very sorry, Sir. మాకు చాలా విచారంగా వుంది.

మోహన్ .- జబ్బేమిటి ఇంతకూ !

పంతులు ·- అది తెలిస్తేనా ? ఈపాటికి మంచి మందులిప్పించి నయం చేయించనూ ! అసల్ రోగ నిదానమే కాలే ! డాక్టరుకే తెలియ దాయెను ఏంచేసేది ?

మురళి :- I s it so We pity him.

మోహన్ :- Wonderful ! I t is very strange !

పంతులు :- వింత జబ్బు ! మాయరోగం ! మా ఖర్మం బాగులేదు నాయనా ఇంతకీ ! అద్బాయికి వివాహం చేతామనుకున్నా. ముహూర్తం కూడ పెట్టుకున్నా ఫస్టుకి. ఈసంగతి 'శ్యాం'తో చెప్పితే ఒప్పుకోలేదు. నేను కొంచెం గట్టిగా చెప్పాను. తప్ప కుండా ఈపెండ్లి చేసుకోవాలనీ, లేకుంటే నా ఆస్తిమీద తనకెట్టి అధికారం ఉండబోదని, చివరకి నాయింట్లో ఉండట్టానికి కూడ వీలుండదని నిర్మొగమాటంగా చెప్పా ! అంతే !

ఇద్దరు :- అతనేమన్నాడు ?

పంతులు :- ఏమంటాడు ? 'ఆదెబ్బతో మెదలకుండా ఊఁ అన్నాడు. కాని తెల్లవారేనించి జబ్బు బయలుదేరింది.

ఇద్దరు :- ( ఒకరి ముఖ మొకరు చూచుకొందురు. )

మురళి .- ఐతే జబ్బెందుకు రావాలి ?

మోహన్ :- నేను అదే ఆలోచిస్తున్నా !

మురళి .- పెళ్ళికి జబ్బుకి ఏం సంబంధం అంటా ?

మోహన్ ·- There should be some link between the two.

మురళి :- It's really strange. Any how, well, let us see our friend.

మోహన్ :- Let us go.

ఇద్దరు .- సరే పంతులుగారు. శ్యాంను చూచి మరీ పోతాం.

పంతులు :- అవశ్యంగా ! రాండి చూపెడ్తా.

( తెర వాలును )

## మూడో రంగం

*[ ప్రవేశం శ్యాంసుందర్. చదువుగది _ అందే ఓ ప్రక్క మడత మంచము, ఒక పడకకుర్చీ (Easychair), రెండు సాధారణ కుర్చీలు వేసియుండును. ఒక Stool మీద మందుసీసా మొద లగునవి పెట్టి వుండును ]*

శ్యాం :- ( *పడక కుర్చీలో తేలగిలి పడి కూరుచుండి, పరధ్యానంలో . .* )

పాట — చెలియా ! కనరావా !

నిరాశచేసి పోయితివా ! ఓ చెలియా కనరావా !

ఓ చెలియా ! ప్రియురాలా ! అపజిత విద్యున్మాలా!
నా కలలోపలతోచి నను క్రీగంటను చూచి
నవ్వుల వెన్నెల కాచి నా హృదయము దోచిదోచి॥ చెలియా॥

( *పాడుచుండును. మురళి, మోహన్, పంతులుగారు ప్రవేశించి* )

పంతులు – ( వారితో ) చూచారా! వానిస్థితి. ఇవే పాటలు, ఇదేపరధ్యానము. ఎప్పుడు ఎదుటలేని ఎవరితోనో మాట్లాడు తుంటాడు. ( ప్రకాశముగా ) శ్యాం! శ్యాం! ( పలకడు ) శ్యాం! ఇదో నీ స్నేహితులు సుబిళి, మోహన్‌లు నిన్ను చూడటానికి వచ్చారు. యిటుచూచు – మాట్లాడు.

శ్యాం .– ( పలకకుండా ) హా – ప్రియా – స్వప్నసుందరీ! నీవు నిజంగా సుందరివే సుందరీ చిత్రాంబవు. ఇతరులకు నీకు హస్తి మశకాంతరం – వాస్తవం చెప్పాలంటే వీరేకాదు – స్వర్గంలో ఉండే ఊర్వశీ – గీర్వశీ. రంభా – గింభా, తిలోత్తమ – గిలోత్తమ, మేనక – గీనక, నీముందు బలాదూరు, నీముందు దిగదుడుపు.

పంతులు – విన్నారా పిచికథ! ఖర్మం! ( అని తలకొట్టుకొని ) ఏం చేసేది. సరే మీరు మాట్లాడండి నాకు బయట పనున్నది ( వెళ్ళి పోవును. )

ఇద్దరు :- మంచిది ( అని కూర్చుండి ) శ్యాం. శ్యాం. ( పిలుతురు. )

శ్యాం – ( వాళ్ళవైపు చూస్తూ ) చూపులు సూనశరాయి; రూపులు కోటి పరాయి.

సుబిళి :- శ్యాం, శ్యాం, పలకవేం ఇదేమిటి? ( వెళ్ళి దగ్గరిగా కూర్చుంటాడు. )

శ్యాం – ( పరధ్యానంతో ) మనోహరీ, నిన్ను చూడకుండ గడియైనా ఉండలేను. చూతామంటే నీవు కనబడవు. వెతుక్కుంటూ వత్తామంటే నీ వెవరో, ఎక్కడ ఉంటావో నాకు తెలియదాయె! పోనీ! కలలోనైనా చూదామనుకుంటే, నిద్ర నన్ను విడచి మూడు నాళ్లాయె! తీరని ఈ గుండెబరువు ఎట్లా సహించేది? ఏం చేసేది?

ఏదీ! గతి నాకు, రంగా – రంగా ॥ఏది॥
కరుణా ఘనా కావగరావా ॥ఏది॥

మోహన్ :- మురళీ! ఏంరా వీడు మనమాట వినేటట్టు లేదు. ఎంచేతో అంతా అయోమయంగా వున్నది. ఎవరి స్వప్నసుందరి!

మోహన్ :- ఏమిరా : This is simply love-sickness.

మురళి :- శ్యాం, శ్యాం ( అని ఊపును. )

శ్యాం :- ( మురళిచేయి గట్టిగా పట్టుకొని )

వున్నవు వెన్నెల రేయి, నిను
కన్నది నా కనుదోయి, చెలి ॥వు॥
చెలి నీ ప్రేమమిరాయి
కలిగించెను మనసుకు హాయి ॥వు॥
చేయపు మెడలో చేయి
మనసెంతయు హాయెను రాయి ॥వు॥

మురళి :- వీడిమెంతు మన వశ్యమయిటేటట్టు లేదు. మన పాండిత్యం పనికి వచ్చేటట్టు లేదు.

మోహన్ :- నాకంతా మనసు దిగులుగా వుంది. ఇది నిజంగా రోగమే ఐతే వీడి గతేం కావాలి మరి!

మురళి :- నువ్వేంటు మోహన్ - ( శ్యాంవైపు తిరిగి గట్టిగా ) శ్యాం, శ్యాం - ఇట్లా మేం బొమ్మలవలె చూచోలేం. నిజంగా మాకు భయం వేస్తున్నది నీస్థితిచూస్తే జాలివేస్తున్నది చూడాను సంగతేంటో త్వరగా చెపుం. లేకుంటే మేం వెళ్ళిపోతాం చూడు. ( మోహన్‌తో ) లే! మోహన్! లే! పోదాం పద. వీడు మనని fools కింద కట్టేస్తున్నాడు. ( లేచి ఇద్దరు కొన్ని అడుగులు నడుతురు. )

శ్యాం :- అహ్హా హ హాహో - అహ్హా హ హ్హాహో - అహ్హా హ హ్హాహో ( చప్పట్లు చరుస్తూ ) You idiots. ఇంతేనా మీ తెలివితేటలు? బిమ్మే చదువుతున్నారు బిమ్మే. ఏడ్చినట్టే ఉంది మీ బతుకు.

ఇద్దరు :- ( ఆశ్చర్యంతో వెనకకు వెళ్ళి ) You hypocrite idiot. Dunce and this and that. (అని వీపుమీద పడాపడా కొడ్తూ కుర్చీలోంచి లాగి మంచంమీద కూలవేస్తరు. )

శ్యాం :- అరే! కొట్టకండ్రా కొట్టకండ్రా. ఉండండ్రా ఉండండ్రా.

మురళి }
మోహన్ } :- కొత్తూనూ తింతానూ చెప్పు! ఎప్పుడురా నేర్చావు నాటక మాడటం? ( అని కొట్టబోదురు. )

శ్యాం :- ( చేయి అడ్డం పెట్టి ) ఉః ఉః, చంపకండ్రా పుణ్యముంటుంది. కూడులేక ఏడుస్తున్నాను మూడు రోజుల్నించి.

మురళి :- నిష్టుపవాసమే!

మోహన్ :- నిరశన వ్రతమే!

మురళి :- ఐతే " లీడర్ "వి కావాలనా ఈః నటనంతా?

మోహన్ :- ఏ Field లోరా నీవు లీడరయ్యేది?

మురళి :- నీకు తెలియదేం? Next year శ్యాం Law join చేస్తున్నాడు.

మోహన్ :- అయితే ఇప్పట్నుంచే ఏమిట్రా ఈః అదాపుకి?

మురళి :- Preparatory methods. ' రిహార్సల్ 'రా యిది

మోహన్ :- ఐతే! రాజకీయరంగంలోనే లీడర్ కాబోతున్నాడన్నమాట.

శ్యాం :- You set of idiots Law కాదురా love field రా నాది.

మురళి :- ఓ అదా! ఉఁ, ప్రేమ రంగంలో కూడ 'నిరసనవ్రతం' కావాలట్రా?

శ్యాం :- నేడు దేనికైన ఇది 'రామబాణం'లా పనిచేస్తుందిరా.

మురళి :- 'రామబాణం' ఏమిటో నీమొహం! ఎప్పుడో పాతలకి పోయిందది. ఆటం బాంబువలె అని కొత్త Example చెప్పరా.

శ్యాం :- ఓ. "హైడ్రోజన్ బాంబు" అన్నా అనవచ్చు. అమోఘమైంది. మా నాన్నకు ఇప్పటికే తప్పకుండా హృదయ పరివర్తనం కలిగి తీరాలి ? అన్నట్లు మీతో ఏమేం చెప్పాన్రా నా పెండ్లివిషయంలో ?

ఇద్దరు :- ఓ అంతా చెప్పేశావు మాకు ఏందట కదరా ఫస్టుకి ? నువ్వు కూడ ఒప్పుకున్నావట పెళ్ళికి.

శ్యాం :- ఒప్పుకుంటే ఈ "మాయరోగం" దేనికిరా ? అసలు నాకా పెళ్లి సుతరాం ఇష్టంలేదంటే నమ్ము.

మురళి :- మరి నీ స్వప్నసుందరి ఎవర్రా ?

శ్యాం :- Well, do you remember that girl in our class with rosy cheeks and splendid looks ?

మోహన్ :- Who is she ?

మురళి - Do you mean that young widow who always sits in the front row ?

శ్యాం :- Yes ! exactly the same ఆవిడేరా అంజలి.

మోహన్ - ఏమంజలిరా ? తిలాంజలా, బాష్పాంజలా

శ్యాం :- కాదురా ప్రేమాంజలిరా ఆవిడను వివాహ మాడ్తానని మాట యిచ్చాన్రా.

మురళి :- ఓ ఇదా నీ మాయరోగం ! ఐతే Widow marriage చేసుకుంటావన్న మాట.

మోహన్ :- ఏంరా ? విధవ పెళ్ళిటరా !

శ్యాం :- విధవ పెళ్ళి కాదురా 'విధవావివాహం' 'సంస్కారవివాహం' అనాలి

మోహన్ :- అదే - ఆపెళ్ళే చేసుకుంటావన్నమాట.

శ్యాం :- అపుడ్రా - శత స్సిద్ధాంతంగా - మనం గాకుంటే మరెవడ్రా ముందుకు వస్తారు ? ఏపెళ్ళయితేంరా ? అసలు 'Love' గదరా పెళ్లికి ప్రధానం. ఆ లెక్కన చూస్తే "Widow marriage" లోనే Love కు stability ఎక్కువ అని చెప్పాలి. మీరిద్దరు కూడా తప్పకుండా చెరో Widow ని చేసుకోండి.

ఇద్దరు :- Well! Well! We appreciate your spirit and grant your plea

మురళి :- నేడు మనకు కావలసింది సంఘ సంస్కారం. భావి కార్య కర్తలు కాబోయే విద్యార్థి బృందమే ఇందుకై నడుంకట్టాలి.

మోహన్ :- తప్పనిసరిగా అది మన కర్తవ్యం.

శ్యాం :- I thank you both. కాని, మా నాయనగారి సంగతో ?

మురళి :- ఓ భయపడకు, ఆభారం నాదిరా. మేము ఇందాక మాట్లాడామే అప్పటికే ఆయన మూర్ఖాయి మువ్వీసం మూడువొట్లు మెత్త పడాడు. ఇప్పుడు మళ్ళి ఆయన్ని చూచి నీ రోగానికి మందేవిటో చెప్పి, పెళ్లికాదంటే వాదించి ఒప్పిస్తాం. నీవు నిర్వి చారంగా ఉండు. కాని మీ నాన్నతో మాట్లాడి ఒప్పించి నీకు చీటి పంపిస్తాం. అంతదాక నీ ధోరణి మాత్రం మారనీయకు జాగ్రత్త! మంచిది వెళ్ళొస్తాం. Good-bye.

శ్యాం :- Thank you in anticipation.

ఇద్దరు :-Don't worry. God is great! Good-bye. (అంటూ చేతులు కలిపి వెళ్ళుదురు.)

శ్యాం :- ( పూర్వాంపరె పాడును )

అంజలీ ! ప్రేమాంజలీ ! ప్రణయాంజలీ గైకోచెలీ ॥ అం ॥
గైకోచెలీ ! గైకోచెలీ ! నీకైకదా ఈ నెంజరి ॥ అం ॥
నీవేకదా నా భావము, నీవేకదా నా జీవము ॥ అం ॥

నా ప్రణయమే నీకై చెలీ! నా ప్రాణమే నీకోచెలీ
నా జీవితం నీకోచెలీ! ఈనాటకం నీకై చెలీ! ॥ అం ॥

(సేవకుడు చిట్టీతో వచ్చి) చిన్నపంతులూ — ఇదోనండి! పెద్ద అయ్య చీటి పెకిచ్చినారు. (ఒళ్లపైనుంచి నిల్చుండును)

శ్యాం :— (ఆతురతతో చిట్టీ చూచుకొని) Thank God! మురళీ మోహన్‌ల కెంతో కృతజ్ఞుణ్ణి. ఇప్పుడు మానాన్న చాలా మంచి వాడు. వెళ్లి నమస్కరిస్తాను ఓరే మల్లడూ! ఎక్కడున్నార్రా నాన్న?

మల్లడు :— నన్నిడిక్కి పంపి, అయ్య బజారు కెళ్ళారు.

శ్యాం :— అయితే నేనూవెళ్లి అంజలికీ శుభవార్త తెలుపుతాను. (వెళ్లును)

మల్లడు :— (సభవైపు చూచి) సెలవు వాబుయి (గొలుక క్రిందికి మీదికి ఆడిస్తూ) అంతా ఇంతే! ఒకప్పుడు క్రిందికి; ఒకప్పుడు మీదికి; క్రిందికే మీదికే; క్రిం – ది – కీ – మీ – ది – కీ. దణ్ణాలు _ సాములు చియయుంచంతి.

(తెరవాలును)



# మధ్యవర్తి


రచయిత :

శ్రీ కనుపతరెడ్డి నారాయణరెడ్డి




జననం : రాక్షసనామ సంవత్సరం

నివాసం : నాషువరం

కార్యకలాపాలు : ప్రజాసేవ ( సూర్యాపేటతాలూకా )

అభిరుచి : ప్రజాసమస్యలను, వాటి పరిష్కార మార్గాలను చిత్రించే రచనలు.

రచనలు : కథలు, గేయాలు పత్రికల్లో ప్రచురింపబడ్డాయి.
" పట్టుదల " నాటిక అముద్రితం.

అభిమానరచయితలు : ఇల్యా ఎహరస్‌బర్గ్, శ్రీ శ్రీ, దాశరథి, సి. నారాయణరెడ్డి, కొదవటిగంటి కుటుంబరావు, విద్వాన్ విశ్వం.



పాత్రలు :

కోటిరెడ్డి

వెంకయ్య

అచ్చయ్య

చంద్రయ్య

రంగడు

సీతయ్య

సోమయ్య

లక్ష్మీపతి



కోటి :- (చేతిలోముట్టికిందపెట్టి) ఓస్ అదా సంగతి! నాకు జ్ఞాపకమేలేదు. ఒకటా రెండా, వందల పనులు. యెన్నని జ్ఞాపకముంటి యేడుస్తయ్! అయితే మీ చంద్రయ్య రాలేదే?

వెం :- వస్తాడు గామాలు యిద్దరూ రావాలని అయనకూ తెలుసు గదా!

కోటి :- మీ జొన్నచేనుకో దంతెలు తోలినారయా! అసలు మా చేను మెన గటమే దేవటనయా. బాగా బిగుసుక పోయింది.

వెం :- పైపెట్టుయి మూరి మాత్రం మెదిగి వచ్చినాదీ! యేదో వకతీరు తోలితే బాగని ఆరాస్తవని తీప్పుకున్నాం.

కోటి :- యిప్పట్లో సుమారయిన వాన పడితే చేను బాగా మెదిగి పోను.

(చంద్రయ్య వచ్చి నమస్కారం చేస్తాడు.)

కోటి :- (బిడుపు సూచకంగా తల ఆడించి) రా చంద్రయ్యా, కూర్చో. యిప్పుడు నీసంగతే మాట్లాడుకుంటున్నాం.

చం :- (చెప్పులు విడిచి వెంకయ్యకు కొంచెం వెడంగా కూర్చుంటాడు.

కోటి - (అచ్చయ్యనుద్దేశించి) యేమిటి అచ్చయ్యా! మీ వ్యవహారం.

అ :- అదేనండి. నిరుడు మా భూములు పంపకానేటప్పుడు మంగచెట్టు చలక నా పాలుకు వచ్చిందని మీకు తెల్సుగదా. ఆ చలకలో యేసిన పైరు దక్కకుంట మా చంద్రయ్యావాళ్ల పశువులు తొక్కటమూ, జీతగాండ్లు గడ్డి కోసుక పోవటమూ, రోజూ యేదో వకటి జరుగుతావుంది. యిదేంటి బావా, చేను పాడై పోతుంది అని వకటి రెండుసార్లు చెప్పినప్పటికీ యేమీ బందోబస్తు చెయ్యడాయె.

కోటి :- యేం చంద్రయ్యా, నిజమేనంటావా?

చం :- ఛా ఛా ఛా! పట్టి అబద్ధమండి. ఆయన చేను నా పశువులు మెయ్యడ మెందుకూ, నాకు బీడు లేకనా?

వెం :— రామ రామ ! యింత అన్యాయమైతేమాత్రం యెట్టా కాలబడుద్ది ? అచ్చంగా పశువుల తొక్కుడు కనుపిస్తుంటే అసలే రాలేదనటం భలే బాగుందిలే

చం :— నీ వాయనను తోడు పలక్కపోతే నాను పల్కుతావా ? బాగా సూడారు యిద్దరు బావ మరదులూ.

వెం — తోడు పలికి అబద్ధాలాడుతున్నామనా నీవనేది ? కావాలంటే రుజువు చూసుకో. చేలో పడిలి పెట్టిన నీజీతగాండ్ల చెప్పులూ, కట్టులూ నీయెడ్ల అడుగులూ అన్నీ వున్నాయి. పూర్కనే గాలికి మాట్లాట్టంలేదు తెలుసా ?

అ :— మీయెడ్లకాసే పచ్చిపాల లింగని చెకుముకిసూడా దొరికింది బావా !

చం :— దొరికినవన్నీ నా జీతగాండ్లవేనని వాటిమీద ( యెడమ అరచేతిలో కుడిచేతి తర్జనితో వ్రాస్తూ ) రాసివుందా ? ఏక వస్తువు తీరుగా యింకోటి వుండదన్నమాట ! పశువుల అడుగులుంటే అవి యే మంది పశువులో, యెప్పుడొచ్చి తొక్కినయ్యో. భలే అనవాళ్ళు పట్టారయ్యా తెలివికల మొగోళ్ళు ! !

వెం :— తెలివికల్లోడివి కాబట్టే చమత్కారంగా మాట్లాడుతున్నావుకాని, చుట్టూవున్న నీభూమిలోనుంచి మంది పశువులు వచ్చి మేసి పోయినయ్యంటే బుద్ధివున్న మనిషెవడైనా నమ్ముతాడా ? మాట్లా డితే కాస్త వెనకాముందు ఆలోచన వుండాలి.

కోటి :— ఆయన పశువులేనని నమ్మకమే నంటావా ?

చం :— రాత్రిపూట యే దొంగముండాకొడుకైనా వచ్చి మేపుకపోగూ డదా ? యెవడైనా కావలివుండి సచ్చాడు గనుకనా. ముందూ వెను కలు ఆలోచించేవాళ్ళు కనుకనే అన్నీ కల్పించుకొని వచ్చారు గదూ.

అ :— ( విస్మయంగా ) హా(. చేనంతా పాడుపాడుగా తొక్కించి లేనివి కల్పించారనటానికి నోరెట్లా వచ్చిందీ అంట !

వెం :- కల్పించారనకుంటే ధైర్యంకల మొగోడివి నాయెడ్ల తొక్కుడు కాదని రుజువు చెయ్యరాదూ.

చం - ( *కుడిచేయి వెల్లకిలా చాచి పైకి ఎగురవేసి* ) పెద్దోడివైతే తర్వాత చూచుకుందాంగాని, మాటలు కాస్త జాగర్తగా రానీ. ఇలాంటి రుజువులకేంతే, నేనూ బోలెడు చేయగలను.

కోటి .- కాస్త నెమ్మదిగా మాట్లాడండి. తొందరెందుకు చంద్రయ్యా!

అ - యీ మాటలకేం, యెన్నైనా చెప్పొచ్చు. యేదోవక తీరుగా నన్ను యిబ్బంది పెట్టి యిచ్చిన భూమికాస్తా కాజేద్దామనే యెత్తు యిదంతా.

చం - యెవడిక్కావాలి నీభూమి; అది కావాలనేవాడు వేరే వున్నాడు. యేదో బిలిబిచ్చికాలు చేసి దాన్ని లాగేయాలని యెత్తులు వేస్తున్నాడు.

వెం :- ( *యెగతాళిగా నవ్వుతూ* ) భలే దాగా చెప్పావు. " నా చేనుకు అచ్చయ్యచేను కలిసుంది. దాన్ని కూడా తీసుకొని మా బొంతు గుట్ట బాడువలో కుంటకట్ట వేయిస్తే ఆ కుంటకింద బంగారం లాంటిది అయిదెకరాల పొలం తేలుద్ది. మిగిలిన బాడువంతా బీడు వదిలితే పునాది వెళ్ళిందాకా పశువులకు పచ్చిదుంప దొరుకుద్ది. ఆ భూమిఅంతా కలిసుంటే పశువులకు మంచి వసతి కుదురుద్ది " అని యెన్నెన్ని విధాల ఆలోచించడంలేదు నీవు ?

చం ;- అవన్నీ ఆలోచించేది నీవా నేనా! అచ్చయ్యకు యిచ్చిన చలకను మా భూమిలో కలుపుకుంటే ఆరెచెట్టు చలకతో కలసి యేభయ్యెకరాలు వక్క ఖండంగా వుంటవనీ, యేనెకు రాయి తీయించి చలకచుట్టు గోడ పెట్టిస్తే పరాయి గొడ్ల బాధే వుండదనీ, బాడువంతటా తుమ్మచెట్లు పెంచితే కావలసినన్ని గొర్రె మందలు తోలించుకో వచ్చనీ యింకా యెన్నెన్ని కలలు కంటున్నావు. నీమాటే సాగితే ( *కుడిచేతి తర్జని పైకెత్తి వలయంగా తిప్పుతూ* ) యీదేశమంతా యేలాలని లేమా!

వెం :- యెవడెన్ని కలలు కంటున్నదీ వాటి చేష్టలే చెబుతున్నాయి. రచ్చ కెక్కి నీతులు చెప్పగానే సరా, చెప్పినట్లు చేసి చూపాలి.

కోటి :- అట్లా యెత్తిపొడుపుమాట లనుకుంటే యేంలాభం వెంకయ్యా!

చం :- (వెంకయ్యను చుర చుర చూస్తూ) నీవేమొ మహలావు మీద వేసుకొని వస్తావు ? తన సంగతేదో తను చెప్పుకోలేడూ.

అ :- నన్ను చెప్పుకోని నిరవాకం కానిచ్చావుగా. పశువులు మేస్తున్నాయి, జీతగాళ్ళు చేను పాడుచేస్తున్నారు వావా అని బతిమాలుకున్నట్లు తిరిగినా చెవిని పెట్టావూ! కాళ్ళరిగించావా తిరిగి విధిలేక చెప్పుకున్నా.

వెం :- అవును, కాస్త నోరు చచ్చిన వాడని వాణ్ణి నానా యిబ్బందులు పెడుతుంటే యేదో అండ చూసుకోక యేం చేస్తాడు ?

చం .- (వెటకారంగా) అండట దండ! ఆయన చెప్పుకోవడం యీయన ఆదరించడం, భలేగా కూడారు యిద్దరూ, విరగిన కట్టెకు పుచ్చినది తోడని (ఎత్తిపొడుపుగా) యెవడి అక్కరను బట్టి వాడు మందిని అండ చేసుకుంటాడు. మొన్నటిదాకా మంది చంకకిందచేరి వాళ్ళు చెప్పినట్లల్లా గంతులేసి మూడారు తీర్పు చేశావు. యిప్పుడేమో గడచిన మాటలు మాట్లాడుతావు. యెవడి వీపు వాడికి కనబడుద్దా ?

కోటి :- (కొంచెం విసుగ్గా) యిప్పటి సంగతేదో మాట్లాడక పుట్టుకను చెప్పమంటే పూర్వోత్తరాలు చెప్పేనని పాతగొడ వెందు వెంకయ్యా.

చం .- (వెంకయ్యా కేసి చుర చుర చూస్తూ) భలే చెప్పావు. పాళ్ళు పంచుకొని వేరుందా మన్నపుడు పంచియిస్తే మందితో చెప్పుకొనడ మెందుకు, వారు కలుగ చేసుకొనట మెందుకు ? శ్రేష్ఠ పొలని కొంత, నా అరదాపు సొమ్ముపెట్టి కొన్నదని కొంత కాజేద్దామని చూస్తే నీవన్నట్లల్లా సాగనివ్వటానికి యిక్కడెవడూ పిచ్చిపాలు తాగడంలేదు.

వెం :- నీపాలు కాజేయాలని యెవడి కుందంటావు ? న్యాయంగా రావలసిందిగాక, ఆశపడిపోయి దానిలో పాలు దీనిలో పాలు కావాలని గొంతెమ్మ కోర్కెలు నీవు కోరావుగాని, నీభాగం యెవరు తినాలని చూశారు ?

చం :- న్యాయంగా పంచియిచ్చే ఘనుడివి కనుకనే మధ్యవర్తులు చేరి పదేసిసార్లు చెప్పాల్సి వచ్చింది.

వెం :- పరుగులమ్ముకున్న వాడిలాగా పదేపదే తిరిగితే పదిసారు యిరవైసార్లు చెబుతారు. మనంపోయి చెప్పుకున్నాక వారేదో చెప్పక యేం చేస్తారు ?

కోటి :- (విసుగులో) అవును పోట్లాడి లేగల కాళ్ళు విరుగ తొక్కినట్లు మీరు మీరు తగవులాడి మధ్యవర్తుల దాకా తెచ్చారూ ! యే పెద్దమనిషైనా తగవు తీర్చమని వెళ్ళితేనే చెబుతాడు కాని, తానేవచ్చి కలుగ చేసుకుంటాడా ? అవసరం కొద్దీ తిరగటమూ, యేదో తోచింది చెప్పమని బలవంత పెట్టటమూ, తీరా అక్కర తీరిన తర్వాత వాడు నలుపూ వీడు తెలుపూ. యిదేనా లోకం మర్యాద ! హుఁ అసలు వకళ్ళసంగతి అంటించుకొనటమే బుద్ధితక్కువ.

వెం :- అబ్బెబ్బె, కావంది. మిమ్మల్ని అనలేదు. మేము మంచివాళ్ళమైతే మధ్యవర్తులేమి చెరుపు చేస్తారండి. యేదో మాటవరుసకు అలా అంటున్నానే కాని, మేము తిరగనిదే వకరెందుకు కలుగచేసుకొని చెపుతారండీ !

చం :- వకరు కలుగ చేసుకొని పంచిస్తేమాత్రం దాన్ని రాసికీ రంగానికీ రానిచ్చావా ? రోజూ యేదో వక గొడవ. రావణాసురుడి కాష్టం ఒకనాటికి చల్లారుదా ?

వెం :- యెవడికి చెబుతావోయ్ నీ నంగనాచి మాటలు. అస్తమానం యెద్దాలె కష్టంచేసిన నాలోటికి సరిగా నాలివ్వవు కాని నాడు భూమి యెక్కువుంటే వూరుకున్నావా ?

చం :- మాలి సరిగ్గా యివ్వనివాణ్ణి నేనా నీవా ? పొలమంతా నాటు వేయించుకొని తీరా నాటు అయ్యాక ఆనాటు పత్తుగా వుంది యిది పలచగా వుందని మాలి దిగ్గోసి పైగా నాతప్పు లెన్నుతున్నావూ ?

వెం - వుద్ధరించినవురే. వూరంతా వకరేటు యిస్తే నీవొక రేటుకి పొలం నాటేయించుకొని నాకు నీతులు చెప్పొచ్చావూ ?

అ - అయితె వెంకయ్య బావా ! నా చేను సంగతేమైనా చెప్పటానికి వొచ్చారా, మీ పాతకయ్యాలు తవ్వుకోటానికా ?

కోటి - ఆ యన్నదమ్ములకు మొదణ్ణుంచి వుందేగా, యివాళ కొత్తేముంది.

వెం :- యేదో మాటపట్టింపువస్తే తానొకటంటే నేనొకటి అనాలిసొచ్చింది గాని, గడిచిన దాని కనుకుంటే యేం లాభం ?

అ .- మరి యింతకూ నాచేను గతి యేమయ్యేటట్లు ?

వెం .- యేదో కట్టుదిట్టం చేసుకొని గాని యిక్కడినుంచి కదలం.

చం - యిదివరకు కట్టనిదేంటి యిప్పుడు కట్టేదేంటి ?

అ :- యేకట్టూ లేకుండా అది అట్లా పాడైపోతుంటే వూరుకోవాలసిందేనా ?

కోటి - యీ గొడవంతా యెందుకు చంద్రయ్యా. అచ్చయ్య చలకను నీవు తీసుకొని, నీ పాముబంద చలక యివ్వరాదూ, యే తగాదా లేకుండా పోతుంది.

చం - ఆభూమి నాకెందుకంటీ. నాకున్నది చాలదూ. మొదట యిచ్చి తరువాత పత్తికిచేసి తీసుకున్నారని నాకిదో నామాంకితమా ?

కోటి - పోనీ వెంకయ్యా, నీవైనా తీసుకొని వొంక తూర్పు చలక యివ్వరాదూ !

వెం :- రామరామ ! నాకెందుకండీ ఆయన భూమి ? యెవరిది వారికుంటే అదే పదివేలు. నా అదృష్టం బాగుండాలె కాని, కష్టపడి దున్నితే నాభూమి బంగారం పండదూ.

కోటి:- యిద్దరూ వద్దంటే యిక తగాదా యేముంది ? పోంది యెవరిచోట వారుండండి.

అ :- అట్లా వుండేటట్లయితే యింతదాకా యెందుకొస్తామండీ. వేసిన కాస్తపైరు పశువులు తొక్కినాక నేనేమి తినేది పిండాకూడు.

చం :- పళ్ళీ అదేమాట ! నీ చేను నలుపో తెలుపో నా పశువులేమైనా యెరుగునా ? నాకే కావలసినంత బీడుంటే నీచేనుకు పశువులొచ్చి నయ్యానడం మూలకున్నవాణ్ణి ముంగిపేయాలనా ! బావమరదు లిద్దరూ యిదో పన్నాగం పన్నారూ ?

వెం :- కాస్త నోరుచేసుకుంటే యెంత లావాటివాడినైనా కట్టిపెట్టొచ్చు. అచ్చంగా పశువుల తొక్కుడు కనుపిస్తుంటే నాపశువులు రాలే దనడం తెలివైన మాటనుకున్నానా ? ( *కోటిరెడ్డి నుద్దేశించి* ) యీ మాటలకేం గాని మీరు చేనుదాకావచ్చి చూడండి అప్పుడు కాని తెలియదు యీయన మాటలపస.

చం :- సరే రాండి ఏరే చూద్దురు గాని.

కోటి :- అ(. అక్కడికి రావటానికి నాకు మాత్రం తీరిచావుద్దూ. నాకు బోలెడు పనులు. ఆ దాపులూరు సీతయ్యనో, చియివేరు సోమ య్యనో, మురుసు కోటప్పనో తీసుకెళ్ళి చూపెట్టుకరాండి, వాళ్ళు చూచి వచ్చినతరువాత యిక్కడేదో ఆలోచిద్దాం.

చం :- సరే. మీరామాటన్నప్పుడు నేను కాదంటానా ?

కోటి :- నీవేమంటావు వెంకయ్యా !

వెం :- ఆయన సరే నన్నాక మేంమాత్రం కాదంటామా.

కోటి :- క్షౌరం చేయించుకొని, స్నానంచేసి, భోంచేసేనాక కిష్టాపురంవెళ్ళి రేపు తిరిగొస్తాను. నేను చెప్పినట్లు వారి నెవరినైనా తీసుకెళ్ళి ఆ ప్రదేశమంతా చూపెట్టుకొని రాండి.

వెం :- సరే వెళ్ళొస్తాము.

చం - మాపటిపూట చేను దంతెతోలడ మైపోద్ది. పొద్దున్నే వెళ్ళొస్తాము రెండి.

*( ముగ్గురూ లేస్తారు. )*

*[ తెర ]*

## రెండో రంగం

*[ స్థలం : మొదటి రంగంలోని కోటిరెడ్డి వరండా. కోటిరెడ్డి దస్త్రరం విప్పి ముందు పెట్టుకొని అందులోంచి పత్రాలు తీసి తిరగవేస్తూ వేళ్లు లెక్కిస్తూ ఖాతాపుస్తకంలోని చూచుకొని బొమ్మలుయెగరవేస్తూ కాయిదాలు తిరగేస్తుంటాడు ]*

లింగడు :- ( *బయటినుంచి లోపలికివచ్చి* ) మంగలి రాముడు దాసునోరి యింటికాడ సగరం చేయబోయిండట. వచ్చినంక దొరోరింటికి రమ్మన్నానని పెండ్లం చెప్తానంది. ముదుసు కోడయ్య బిడ్డను తీసుకరాను నిన్ననే గోకారం పోయిండట. దాపుయారు సీతయ చిత్వేరు సోమయ యిప్పుడే వస్తున్నంవన అన్నారు. ( *ముగించి తొందరగా లోపలికి వెళ్ళతాడు.* )

కోటి :- ( *ఖాతాపుస్తకం తిరగేస్తూ పేరీజులు చూస్తుంటాడు.* )

( *బయటినుంచి యిద్దరువచ్చి నమస్కారాలు చేస్తారు.* )

కోటి .- ( *వికసించినముఖంతో తల ఆడించి* ) రాండి రాండి కూర్చొండి.

సీత :- కృష్ణా, పరంధామా ! యెక్కడున్నావురా నా తండ్రీ ! ( *కష్టంగా కూర్చొని చేతికర్ర పక్కకు పెట్టుకుంటాడు* )

సోమ .- ( ఆయన పక్కనే కూర్చుంటాడు )

సీత .- యేమో వెంపారి అజ్ఞ!

కోటి - వాస్తు పసుంటేనే గదూ పిలిచేది.

సోమ .- యేపనీ లేంది పూర్కెనే పిలిపిస్తారయ్యా.

కోటి - అదేనయ్యా గోగుల అచ్చయ్య చలక లగాదా.

సీత :- ఆ చంద్రయ్యగాడు వానానే రాజపెట్టిండట లేండి.

సోమ :- తల్లిమంద మొయ్య, ఖలేయెట్టు కుదిరిందిలే.

కోటి - ఒసలు మొదట ఆలోచనే బాగుండాలివాని. తర్వాతికథ యెట్లంటే అట్లా నడపటూ

సీత - మనం మంత్రమేస్తే యెన్నడైనా పారినందా పోయిందా అని.

సోమ - తల్లిమంద మొయ్య, అన్ని దినుసులూ సరిగ్గా పడితే మందు బాగుండక పోద్దా ?

సీత - యీపాటికి అచ్చయ్య మీ దగ్గరికి వచ్చే వుండాలి.

సోమ - ( ఆహాహ పూర్తిగావాసుంచే ) రాకింకెక్కడికి పోతాడు ?

కోటి - రావడమేకాదు, అన్ని యేర్పాట్లు చేశాను. మీరు ఆదేను దగ్గరికి వెళ్ళి చూచిరాండి. తరువాత కథంతా యిక్కడే.

సీత - ముదయవిల్ల ఆమాత్రం మాకు తెలియదంటారా ?

కోటి - వాస్తు చంద్రయ్యను కనిపెట్టచూస్తుండాలి. అక్కడికొచ్చే మనిషి.

సోమ - తల్లిమంద మొయ్య, పాలిచ్చే బర్రెనే మరచి పోతామంటీ.

కోటి .- పంటితుంటే పాలిచ్చే టట్టుండాలి. కాని పొమగు కోస్తే బాగుంటదా ?

సీత :- యేదో భగవంతుని దయవల్ల అంతమాత్రం తెలిపుంచనుకొంటి. లేందే అరపయ్యేండ్లు యెట్లా యీడ్చుకొచ్చామని.

కోటి :- భోంచేసి కిష్టాపురంవెళ్ళి రేపొస్తాను. అచ్చయ్య, చంద్రయ్య పొద్దున్నే మిమ్మల్ని పిలుస్తామన్నారు. అందరు కలిసివెళ్ళి చేను చూచిరాండి.

సీత :- ఇంకా వెనుక పడుం దాడుతామా ?

[తెర]

## మూడో రంగం

[స్థలం : చంద్రయ్యా యిల్లు. అరుగు మీద మూలను రెండు గంపలు ఒక దానిపైన ఒకటి పెట్టబడి వుంటాయి. ఒక మూలకు చుట్టిపెట్టిన ఈత చాప వుంటుంది. బయటినుంచి లక్ష్మీపతి వెంకయ్యాను అచ్చయ్యాను వెంటబెట్టుకొని వస్తాడు. వచ్చేవరకు వాకిట్లో యెవరూ వుండరు]

లక్ష్మి .- చంద్రయ్యగారూ !

చం :- ఆ( వస్తున్నా. (లోపలినుంచి వచ్చి) ఓహో నీవా లక్ష్మీపతి గారూ ! చాప పరుస్తాను వుండండి. (మూలనున్న చాపతీసి పరచి) కూర్చోండి.

[వెంకయ్యా అచ్చయ్యా దగ్గరగా కూర్చుంటారు. వారిపక్కన లక్ష్మీపతి కూర్చుంటాడు. ఆయన కుడివైపున చంద్రయ్యా కూర్చుంటాడు]

లక్ష్మి :- పశువులు చేలుమేస్తే పరిష్కారానికి మధ్యవర్తిదగ్గరె కెళ్ళారా ?

చం :- అంతా అబద్ధం. నా పశువులకు బీడు లేకనా చేను మేపడం.

అ :- యెప్పుడు పాడినా ఆదేపాట. యిక్కడుండి మాట్లాడితే యేం తెలుసుద్ది. చేను కెళితేగాని రాముడో రాకాసో కనబడదు.

లక్ష్మి :- తొందర పడకండి. నెమ్మదిగా ఆలోచింతాము. యిలాంటి తగవులుంటే మనం చూసుకోవాలి కాని కోటిరెడ్డి దగ్గరికెళ్ళి ప్రాధేయపడ్డ మెందుకూ ?

అ :- చేతగానప్పుడు చెప్పుకోక యేం చేయాలి. ఒకనాటితో తీరిపోయే దైతే యెట్లాగో చేసుకుంటాం. రోజూ వకటే గొడవాయె.

చం :- తగవుంటేకదా తీర్చడానికి.

అ :- మే మగావా లేనిదే పొద్దుపోక చెప్పుకున్నామనా నీవనేది. యెంత సేపు అదేమాట.

చం :- నిజమైన మాటైతే యెన్నిసార్లయినా అనొచ్చు.

అ :- నీవు నిజం మాట్లాడుతున్నావు, మేము మనిపాటు లేక అబద్ధాలకు ఆయన చుట్టూ తిరుగుతున్నా మన్నమాట !

చం :- అబద్ధాలకో నిజానికో తిరుగుతూనే వున్నారు గదా.

వెం :- తప్పుపనులు చేస్తే తిరస్కారం చేస్తారు ?

చం :- యెవరు చేశారంటావు తప్పు. తప్పులోపుంది కుయ్యోత్తు అన్నట్లు చేసేదంతా నీవు, పైగా నన్ననవచ్చావూ!

లక్ష్మి - తప్పో పొరపాటో యెవరివల్లనైనా జరుగుతుం దనుకోండి. ఆ మాత్రానికే మనం కోటిరెడ్డి దగ్గరికి పరుగెత్తు కెళ్ళాలా ! ఆలోచించటానికి మనకు తెలివితేటలున్నాయి గదా, మన వ్యవహారాలు మనం ఆలోచించుకోలేమా ?

వెం :- యేదో పేరుపడిన వాడనీ, మొదట్నుంచీ నలుగురూ యెళ్తున్నారనీ మేమూ యెళ్ళాం అంతే.

లక్ష్మి :- యేమిటి ఆయనకున్న పేరు ? లోపాయకారిగా వారికి వీరికి తగవులు పెట్టడమూ తరువాత మధ్యవర్తిగా తయారై కూర్చోవడము, అందినంత వరకు రెండు చేతులా సంపాదించడమూ, అంతేనా ?

వెం :- (సాలోచనగా) ఆయన మంచిని మోసంచేసి సంపాయిస్తాడంటే నేను నమ్మనంటి.

లక్ష్మి :- మోసమని తెలియనిస్తే కదూ నమ్మడానికి. యెక్కడో మీట నొక్కితే నాటకమంతా అదే జరుగుతుంది గదూ.

వెం .- ఆయన పక్కోడు అన్యాయంచేస్తే లక్కోని పెద్దమనుషులంతా కూలికి విషం తాగుతారా !

లక్ష్మి .- వారా ! వాళ్ళంతా పుత్తు పేటపక్కల పకం యిచ్చావాలు మాట్లాడుతూ కోటిరెడ్డి దగ్గరికి చేరడం, ఆయన చెప్పిన దాని కల్లా తలయూపడం, యెవరైనా తగవులాడి వస్తే మసిపూసి మారేడుకాయ చేయడం, కోటిరెడ్డి సంచి నిండే వుపాయం చూడడం, ఆయన నాలుగు డబ్బులు చేతిలో వేస్తే కళ్ళ కద్దుకొని చక్కాపోవడం, యిదేగా వారి పెద్దమనిషితరహా!

వెం:- యేదో పెద్దమనిషి కాబట్టి యెవరైనా యిస్తే తీసుకుంటాడు గాని, ఆయన అలాంటి మనిషి కాదనుకుంటా.

లక్ష్మి - అవును. వారు చేసిన న్యాయమేదో చెప్పండి. వుసులూరి తిమ్మయ్య తమ్ముడితో తగాదా పెట్టుకుంటే దాన్ని యేడాదివరకు మెలివేసి చివరకు "యేమిరా కాటా అంటే యెప్పటి ఆటే" అన్నట్టు చేశారు. మాలగాని వెంకటయ్య బావ మరదలు తగవు లాకితే ఒకరిపై ఒకరికి చాడీలు చెప్పి యిద్దరి కొంపలూ కూల్చారు. సురభి వుల్లయ్య కోడలు తగవులో రెండు వైపుల నుంచి చేయి తడిచేసుకొని చివరకు ఆలుమగలకు యెడబాపారు. యిలాంటివి బోలెడున్నాయి. కీరు మరిస్తే అంచరు మరవాద్దూ !

అ:- అవునుపాపం ! సిలకాగోరెంకల్లాంటి ఆలుమగలు సంసారానికి యెడబాసిపొయ్యారు.

వెం :- (*ఇంటికప్పువైపు పరగా చూస్తూ*) వాళ్లలాంటి వారవునేమో కాని కోటిరెడ్డికూడా అన్యాయపు మనిషేనంటావా ?

లక్ష్మి :- వకటి కాదు, వందసార్లంటాను. అన్యాయపు మనిషి కాక న్యాయంగా నడిచే వాడైతే యిరవయ్యేండ్ల కింద అరవయ్యెకరాల భూమిగల వాడికి యివాళ రెండు వందల యకరాలభూమి యెలా వచ్చింది? తానేమైనా పోడుకొట్టి బాగుచేశాడా?

వెం :- వకళ్ళు అమ్మితే కొన్నాడే కాని, మందిభూమి అన్యాయంగా లాక్కున్నట్టు లేదే.

లక్ష్మి :- అమ్ముతా కొనమని ఆయనదగ్గరి కెవరు నెత్తినేసు కెళ్ళారు? లేని తగవులు కల్పించి మందిని యిబ్బంది పెట్టడం, ఆ యనను కని పెట్టి మధ్యవర్తులు కల్పించుకొనడం, వున్నభూమి అమ్ముకొని మరోచోట కొనుక్కోండని కొందరు సలహాలు చెప్పడం, విధిలేక వారు అమ్మడం ఆయన కొనడం, అంతేకాని, అమ్మేవారు యిష్టమై అమ్మితే కొనేవా రెంతమంది లేరు. యీయనొక్కడే కొనాలా!

వెం :- అందరికీ అన్యాయమే చేశాడంటావా?

లక్ష్మి :- చెయ్యనిదెవరికీ అంట? ఎకరిదాకా యెందుకూ, మీ సంగతే చూడరాదూ, గోరంతను కొండంత చేసుకొని మీరు ఆయన దగ్గరి కెళ్ళడము, ఒక్కనాటికీ తెగనివిధంగా ఆయన పరిష్కారం చేయడం, కాకపోతే నీ కలిమెల దుబ్బచలకలోనుంచి చంద్రయ్య పశువులను వెళ్ళనివ్వాలని, ఓ చాకెరబండ పొలానికి చంద్రయ్య వంగతోటపంపు మధ్యనుంచి కాలువవుండాలని, మీ పీరుణీబావి కొట్టం ముందునుంచి చంద్రయ్య పశువులకు డొంకవుండాలనీ షర్తులు పెట్టడం కలిసివుండటానికా, కయ్యాలుపెంచటానికా?

చం :- ఆ షర్తుల్నిమాత్రం సాగనిస్తున్నాడూ? కొట్టంముందునుంచి డొంక వుండాలంటే దానికి రెండువైపులా కంపపాతి తగని యిరుకుగా చేశాడు. పశువులు కాస్త అటుయిటు కదిల్తే కంపనీడ్చుకొని తోళ్లు రకతం చిమ్ముతాయి. రోజూ యెన్నో యిబ్బందులు పడి తోలుక పోతున్నాం.

వెం :- ( వెటకారంగా ) మహబాగా చెప్పావు. చేసుకున్నోదానికి పశువుల తోలుక పోతున్నామని పైపంతా తొక్కించడమూ, కాలువ కిందనేఉంటే పొలంపాడై పోతుందని దాన్ని పూడిపించడమూ యివన్నీ చేసేది నేనా నీవా ?

లక్ష్మి .- సరె పోనీండి. పెంట కుళ్ళగిస్తే పెంకులు బయటపడుతాయి ? జరిగిపోయినదాన్ని మరచి ముందుబాగు చూడుకోవాలి.

వెం :- బాగు చూసుకోవాలనే కోటిరెడ్డి దగ్గరి కెళ్లాము గదా ?

అ :- ఆయనయితేనే యేదో కాస్త కట్టుబాటు చేస్తాడని.

లక్ష్మి :- దొరికాడు మీకో ఘనుడు. ఆయన చేసిన దానివల్లనే యిదంతా జరుగుతుంటే మళ్ళీ ఆయన దగ్గర కెళ్ళడ మెందుకు ? మురికి నీళ్ళలో బట్టలుతికినట్లు ?

వెం :- అయితే మరి యెవరి దగ్గరి కెళ్ళాలి ?

లక్ష్మి :- కొంచెం వెనుకముందు ఆలోచిస్తే మస్తుగనౌతుంది. మంచి పెద్దలు ఆలోచించి సరియైన పరిష్కారం చేసేవా రున్నారనుకోండి. అలాంటి వారిమీద యెన్ని ఆధారాలు! పెద్దోరి రామయ్య సంగతే చూడరాదూ. ఒకటి రెండు తగవుల పరిష్కారం చేసే వరకు కోటిరెడ్డి మూతా ఆయనేన్నమన్నదీ మనకు తెలియదూ "మంది దాకీలు యెగవేయిస్తున్నాడు. భూములకు సరియైన రసులు యివ్వొద్దంటున్నాడు. కొంచెం సలహాయి చెప్పి మందిని తప్పుతోవ పట్టిస్తున్నాడు. మొండిచేతుల వాడికి నువ్వులు తిన నేర్పే రకం" అని అంటున్నారుకదా! యివన్నీ నిజమేనంటారా ?

వెం .- ( ఊగిసలాటగా ) కాదనుకో. కానీ మొదట కోటిరెడ్డి దగ్గరి కెళ్లి చెప్పుకొని మళ్ళీ వస్తామన్నాంగదా, ఆయన దగ్గరి కెళ్ళక పోతే యేమనుకుంటాడో!

లక్ష్మి :- యేమిటి ఆయ ననుకునేది. పూర్వంనుంచి చేసిన పొరపాట్లే తిరిగి చేయాలని వుందా ? ఆనాడు తెలియక పెళ్ళాము. యిప్పుడు

ఆయన కుట్రలను తెలుసుకున్నాం. కనుక మన తగాదాలను మనమే పరిష్కరించుకోవాలి కాని. యింకా ఆయన దగ్గరి కెళ్ళడ మెందుకూ?

వెం .– వాస్త కలిగినవాడు. లక్ష్మంసు నాలుగు డబ్బులు అప్పిస్తాడని, నడిచే దారికి కంపకొట్టుకోవడ మెందుకా అని ఆలోచన

లక్ష్మి :– అప్పిప్పవర డబ్బు పాతరేస్తాడా ? పెట్టి ఆశపు అప్పులిస్తాడు కాని తగవుల పరిష్కారానికి రాలేడని యిప్పటం మూసేస్తారా ? అయినా అప్పిస్తున్నాడుగదా అని ఆయని పల్లోపడి కీచులాడుకుం టామా? ఆయన రాకపోతే పర్యావగా మనలోచోట తెమ్పుకుంటాం.

చం .– మొదట్నుంచీ అనుభవిస్తున్నవాడుగదా, యిల్లాంటి వాటిని దేల్చా లంటే ఆలోచన వుంటాదా ?

లక్ష్మి :– అయితే ఆయనమాత్రం దెలిసి మనకు లేదేనా, ఏంటనేది ? యీ మధ్య పెద్దోరి రాముయ్య. పొన్నం సూరయ్య కలిసిచెప్పిన తీర్పులు మీకు తెలిసే వుంటాయికదా. వాటిలో యేమైనా పొర పాట్లున్నాయా. కోటిలెప్పి మరావారి తీర్పులవంటి చిక్కులేమైనా వున్నాయా?

చం .– తెలుసు. చెప్పిన తీర్పులు దాగానే వున్నాయి

ల :– వెనుక వుల్లయ్య కాకపోతే తగవు తీరినందుకు మురిసి పోతు న్నారు.

లక్ష్మి :– అలాకక్కరేనా ? తెల్లాకుల నాలయ్య తీర్పెలావుంది?

చం :– అదికూడా దాగానే వుందని చెప్పుకుంటున్నారు.

వెం :– వారు చెప్పిన తీర్పులు దాగానే వున్నా యనుకుంటున్నారు. అయితే యిప్పు డేంచేద్దామంటాడు ?

లక్ష్మి :– జరిగిన పొరపాట్లను సరిదిద్దుకొని ఒకరికొకరు ఒకరు సుఖంగా వుండాలంటాను. యేమంటావు చంద్రయ్యగారు ?

చం :- సరే మంచిది

అ :- మీరంతరు చెప్పేది బాగానే వుంది. కాని, నాచేనుసంగతేమన్నట్లు?

లక్ష్మి :- అసలు నీచేనుగురించేకదా యీ చర్చ అంతా. నీ యిబ్బందులు తొలగే మార్గమేమిటో మొదట నీవే చెప్పరా

అ :- మా వాళ్లు నాకిచ్చిన భూమి నాకే వుండనివ్వాలి. దానిలో యే పంట మతులు చేసినా నేను చేసుకోవాలి కాని ఒకళ్ళు పిలవనిదే వచ్చి యిది యిలా చెయ్యి. అది అలా చెయ్యి అని అనవసరంగా కలుగ చేసుకోవద్దు. అంతేకాదు. నాచేనుకు వీరి పశువులుకాని. జీత గాండ్లుకాని రాకూడదు.

లక్ష్మి :- (వెం, చం లిద్దరిని చూచి) యీ మాటను మీరేమంటారు?

వెం :- అచ్చయ్య చెప్పినదంతా నా కిష్టమే

చం :- నాకు మాత్రం యిష్టం లేదు. నేనాయన చేనుకేమైనా పొయ్యానా?

అ :- నీవు నాతెలుపు రానిదే యీ గొడవంతా యెందుకు అంట? యింతవని జరిగినా నేనేమి అనగలను. సరే కాని, ఇన్నాళ్ల నుంచి మేసినందుకు నష్టం?

చం :- యెవర్ని అడుగుతున్నావు నష్టం! యెప్పుడైనా ఒకటి అది మేస్తే యింతగొడవచేసి పైగా నష్టం కట్టివ్వమంటున్నావా?

అ - యెవరినో యెందుకడుగుతాను? మేసినవి నీయెద్లు, అడిగేది నిన్ను.

చం .- నేను నష్టం కట్టివ్వడం నీవు తీసుకోవడం! మళ్లె కట్టుకుందువు గాని, కొత్త కంచెను తెచ్చుకో. లోకంలో ఎప్పుడైనా పశువులు చేనుమేస్తే నష్టం కట్టిస్తారేంటి?

లక్ష్మి :- తొందరపడకండి. ఒకదారినపడ్డ వ్యవహారాన్ని మళ్ళీ చిక్కుల్లోకి లాగకండి. పైరు వేసినదల్లా పండించుకొని తినడానికేగదా! అలాంటిదాన్ని పశువులు మేస్తే చేనుచేసినవాడేమి తింటాడు?

యెప్పుడో ఒకటిమేస్తే ఊరుకోవచ్చుకాని, అదేపనిగా రోజూ మేస్తే యెవరికైనా నష్టం కట్టివ్వాల్సిందే.

అ :- యెన్ని పశువులు మేసిందీ యెంతనష్టమయిందీ మరేచూతురుకాని, చేను దగ్గరికి పోదాం రాండి.

వెం :- సరే మనమే వెళ్ళి చూదాం పదండి.

లక్ష్మి :- నేనొక్కడినే కాదు, ఆ పెద్దోరి రామయ్యనుకూడా తీసుకొని పోదాం యేమంటావు చంద్రయ్యా ?

చం :- నే మమాత్రం వద్దంటానా ? చూచివద్దాం పదండి.

లక్ష్మి :- అయితే రేపండి వెళ్ళవద్దాం.

(అచ్చియ్యలేచి రెండడుగులు నడిచి కుడితాలు చెప్పులో పెడు తుంటాడు. వెంకయ్యలేచి నిలుచుంటాడు. చంద్రయ్య, లక్ష్మీపతి లేవబోతుండగా)

[తెర]

- —•◆•—

# అనుమానము

---

రచయిత :

శ్రీ దివాకర్ల వేంకటావధాని



జననం : 1913

నివాసం : హైద్రాబాదు

అభిరుచి : సాహిత్య విమర్శ.

రచనలు : ముద్రితం : కావ్యాలు : రాజసందర్శనం, - షరివర్తన.

నాటకాలు : కౌముదీమహోత్సవము, నాగానందం.

వచనగ్రంథాలు : ప్రకృతి విజయం, గురుశిష్యులు, కవిత్రయము, కిరాతార్జునీయము.

వ్యాసాలు : సాహిత్య విమర్శనలు మొదలగునవి.

అభిమానరచయితలు : శ్రీనాథాదులు, విశ్వనాథ సత్యనారాయణ.

"ఇంగ్లీషు, సంస్కృత, ఆంధ్రనాటకముల సమన్వయము" అను విషయముపై పరిశోధన గ్రంథరచనమునకు, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు 1936 లో ఎం. ఏ., ( ఆనర్స్ ) డిగ్రీని ప్రదానము చేశారు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయములో తెలుగు ఉపన్యాసకులుగా నున్నారు.

★

పాత్రలు :

రంగన్న

భీమన్న

నీలకంఠశాస్త్రి

ప్రతాపుడు

యమున

రుద్రాంబిక

సేవకుడు



# అనుమానం

## ఒకటో రంగం

[మొగిలిచెర్ల ప్రాంత మందలి అడవి. రంగన్న భీమన్న లనే ఇద్దరు దొంగలు ప్రవేశిస్తారు]

భీమన్న :- రంగా! రెండేళ్ళనుంచి మన వ్యాపారం ఏమి బాగుండ లేదురా. కడుపునిండా తిండైనా లేక పిల్లలూ మనమూ మలమలా మాడి పోతున్నాము.

రంగన్న :- నే నెఱుగున్నాక ఇంత దరిద్రం ఎప్పుడూ పట్టలేదురా. చేసేది దొంగతనమైనా దొరల్లాగు ఉండేవాళ్ళం

భీమన్న :- అవున్రా. ఆ రోజులన్నీ గడచి పోయాయి. కడుపు కూటికై కూలో నాలో చేసుకోవలసిన గతి పట్టేటట్టుంది. ఇంట్లో వ్యవహారం చూస్తే గుండె నీరై పోతోంది.

రంగన్న :- డబ్బు చేతినిండా దొరికినప్పుడు క్రిందా మీదా చూడకుండా విచ్చలవిడిగా ఖర్చు పెట్టేశాం. ఇప్పుడు విచారిస్తే ఏం లాభం? కల్లునీళ్ళు రుచిచూచి రెణ్ణాళ్లయిందంటే నమ్ము.

భీమన్న :- అసలు తిండే లేకపోతూ ఉంటే కల్లుమాట చెపుతావు నువ్వు. ఏదైనా పనిచేసుకొందామంటే అదీ అలవాటు లేదాయె. ఏం చేయాలో తెలియకుండా ఉంది.

రంగన్న :- రాజుల్లా బతికిన వాళ్ళం రాయీ రప్పా మోయగలమా? మళ్ళీ మన వ్యాపారం సాగాలి; మన ఇళ్ళు నగలు నాణేలతో కలకల్లాడాలి.

భీమన్న :- ఇంక మన వ్యాపారం సాగడం కల్లోమాట. ఈ కొత్త రాణి ఉన్నంతకాలం మనం ఈ వ్యాపారానికి నీళ్ళు వదులుకోవలసిందే.

లింగన్న :- ఒక్క వ్యాపారానికే కాదు ప్రాణాలకు కూడా గజదొంగలు కూడా గడగడా వణికి పోతున్నారు.

భీమన్న - ఆవేళ నాగన్నగార్ని కూడా మనతో రావలసిందని ప్రతిమాలాను. వాడు బ్రతికుంటే బలుసాకు తినవచ్చు. నేను దొంగతనానికి మాత్రం రానని ఖండితంగా చెప్పేశాడు.

లింగన్న :- అందులో వింతేముంది? ఇంట్లో అందరు పిరికీలుగా మనమూ ఉంటే చూడలేక తెగించి ఇలా వచ్చాంకాని మనకేమాత్రం ప్రాణాలు ప్రాణాల్లో ఉన్నాయా?

భీమన్న :- ఆడది రాజ్యం చేయడం, ఆమెకు రాజులంతా వంగి వంగి నమస్కారాలు చేయడం. ఇష్టంలేక మొన్న కొందరు సామంతరాజులు తిరుగుబాటు చేశారు. ఆ దెబ్బతో ఆమె పీడ వదిలి పోతుం దనుకున్నాను. కాని మన రోజులు బాగుంటేనా.

లింగన్న - ఏం జరిగింది?

భీమన్న - రాణీ స్వయంగా సేనలు నడిపి వాళ్ళందరినీ ఓడించి పాదాక్రాంతుల్ని చేసింది.

లింగన్న - ఆవిడ శౌర్యమంతా యెప్పుడు నేర్చుకుందో. ఆడదాన్ని కదా అని అంతఃపురంలో కూచోకుండా అన్ని రంగాల్లోకి దూకి వస్తుంది.

భీమన్న :- గణపతిదేవ మహారాజు తనకు కొడుకులు లేకపోవడంచేత, ఆమె చిన్నతనంలోనే వైధవ్యం పొందడంచేత, పురుషులు నేర్వవలసిన విద్యలన్నీ నేర్పించి ఆమెను తన తర్వాత రాజ్యం పరిపాలించడానికి అర్హురాలినిగా చేశాడు.

లింగన్న :- పురుషులను పురుషులనడమే కాని ఎందుకు పనికివస్తారు ఆమె ముందు? గుర్రమెక్కి విల్లమ్ములు పుచ్చుకుంటే వీరులు గీరులు వెన్నుచూపి పరుగెత్తాల్సిందే.

భీమన్న :- నెల్లాళ్ళ క్రింద ఒకసారి ఆమె ప్రతాపం రుచి చూచాను. నాగన్నగారు కూడా ఆరోజున మాతోనే ఉన్నారు దైవ కృప వల్ల ఏలాగో మేమిద్దరం ప్రాణాల్తో బయట పడ్డాం. మిగిలిన వాళ్ళు ముగ్గురూ ఆమె కత్తికి బలై పోయారు. అది చూచి నప్పట్నుంచే నాగన్నకు ఆమె పేరు చెబితే హడలు

రంగన్న - మరి మరేం ఆమె నెదిరించ లేరట్రా ! ఆమె ఆడది, మీరు మగవాళ్ళు, ఆమె ఒక్కతె, మీరైదుగురు; ఎదిరి పారిపోయా రంటే నాశ్చర్యం వేస్తోంది

భీమన్న .- నీవు స్వయంగా చూడలేదు కాబట్టి ఆమె సంగతి ఏమేమో అనుకొంటున్నావు. ఆడదన్న మాటేగాని ఆమెముందు మన మెందుకు పనికొస్తాం ·

రంగన్న - ఆమెకూడా మగవేషంతోనే గుఱ్ఱంమీద కూర్చుంటుందటగా.

భీమన్న .- సరిగా మగవాని లాగానే ఉంటుంది. చెబితేనేగాని ఆడదని తెలియనే తెలియదు అదిగో ఆదారినేదో విన వస్తోంది. కొంప తీసి ఆమె రావటంలేదు గదా

రంగన్న - ఇప్పుడెక్కడనుంచి వస్తుందిరా. ఎక్కడ వరంగల్లు. ఎక్కడ మొగలిచెర్ల.

భీమన్న :- అట్లా అనకు. ఆమె అనుకొంటూ ఉంటేనే ప్రత్యక్ష మౌతుం దిరా వెనుకటి రాత్రి వీరభద్రుడిపిల్లాగ. ఏమూలనుంచి వస్తుందో ఏలా తెలుసుకుంటుందో చెప్పలేము పైగా మూడురోజుల క్రింద మొగలిచెర్ల ఏకవీరాదేవి ఉత్సవాలు చూడటానికి వచ్చిందని విన్నాం గదా !

రంగన్న :- ఔను : ఉత్సవాల్లో ఉన్నది కనుకనే యిప్పుడేలా వస్తుం దంటున్నాను.

భీమన్న .- ఆమెకు దుష్టశిక్షణం, ప్రజారక్షణం రెండే ఉత్సవాలు. వీటి కోసం ఆమె ప్రాణాలు కూడ లెక్కచేయదు. పైగా నిన్నటి తోటి ఉత్సవాలు అయిపోయాయి అని విన్నాను.

రంగన్న :- అందుకోసమే కాబోలు ఈ వేళ ఉదయంనుంచి చాలామంది ఈ దారిని పోతూ ఉన్నారు. ఈ సందడిలోనే మనకేమైనా కొంత వ్యాపారం సాగాలి. లేకపోతే మాడి చావవలసి వస్తుంది.

భీమన్న :- నేనూ అందుకే తెగించాను. అన్నంలేక మాడి చావడం కంటె ఆమె చేతుల్లో చావడమే మంచిదని.

రంగన్న :- ఎందుకోరా ముందరే అపశకునాలు. అదిగో ప్రొద్దు గుంక పోతూ ఉంది ఇప్పుడే మనం కొంచెం జాగ్రత్తగా పనిచేయాలి.

భీమన్న :- మారాస ఏవో మాటలు వినిపిస్తున్నాయి. ఎవరో వస్తూ ఉన్నట్లున్నారు.

రంగన్న :- రావడం కాదురా! దారిప్రక్క ఆ మఱ్ఱిచెట్టుక్రింద ఎవరో యిద్దరు కూర్చుని మాటాడు తున్నారు. ఒకామె ఆడది. ఒకా యన మగవాడు. బహుశః యాత్రికులే ఐ ఉండాలి.

భీమన్న :- (చూచి) ఔరా! ఎవరో చిన్నది చక్కని చుక్కలా ఉన్నది. మెడలో ఏవో నగలు కూడా ఉన్నాయి. అస్తమిస్తూ ఉన్న సూర్యుడి కిరణాల్లో తళతళ లాడుతున్నాయి.

రంగన్న - రెండోవ్యక్తి చాలావృద్ధు. ఆ గంధం, పెద్ద బొట్టూ, మెడలో జంచెం, చూస్తే బ్రాహ్మడులాగా కనబడుతున్నాడు.

భీమన్న :- ముసలి వాడయ్యా ఐతే మనకి మరీ మంచిది. అసలు ఎవ రైతేనేం మనముందు నిలుస్తారా ఏమిటి?

రంగన్న :- పద. చెట్లచాటునుంచి దగ్గఱకు పోదాం. (ముందుకు నడుస్తారు)

భీమన్న :- ఒరే రంగా! ఎన్నాళ్ళయిందిరా ఈలాంటి మంచి అవకాశం దొరికి మనకి. ఒక క్షణం ఆగి మీద పడదాం. ఇంతలో సూర్యుడు కూడా అస్తమిస్తాడు.

రంగన్న :- వీళ్ళు మొగిలిచెర్లనుంచే వస్తున్నారనుకుంటా. చీకటి పడ దోస్తోంది కదా! ఇంతవరకు కెందుకు కూర్చున్నారో.

భీమన్న :- ఎవరికోసమో ఎదురు చూస్తూ ఉన్నట్లున్నారు.

రంగన్న :- ఇంకా ఎవరికోసం? ఒక్క క్షణం ఉంటే మనకోసమే.

భీమన్న :- నీవు ఆ దాపసయ్య మొవపడి నోరు నొక్కు. నేనామె నోరు మూసి నగలన్నీ ఒలిచేస్తాను.

రంగన్న :- సూర్యుడు పూర్తిగా వాలిపోయేదాకా వీ మాటలు విని తర్వాత పని చేద్దాం రా (ఇంకా కొంత ముందుకు నడుస్తారు)

## రెండో రంగం

(యమున, నీలకంఠశాస్త్రి ప్రవేశిస్తారు.)

యమున :- శాస్త్రులుగారూ! మొగిలిచెర్లకు వెళ్లినాయన ఇంకా రాలేదు. సూర్యుడస్తమించ బోతున్నాడు. నాకేమో దిగులుగా ఉంది.

నీల :- భయపడకమ్మా! వెళ్లి రావాలికదా మరి. ఇంకెంత. మన ఊరి దగ్గరికి రానే వచ్చాం. ఆయన వచ్చాడంటే రెండు గడియల్లో మన ఊరు చేరుకుంటాం.

యమున :- మొగిలిచెర్ల ఇక్కడికి కెంత దూరం ముంటుందండి?

నీల :- ఎంతో దూరమా! మహా ఉంటే రెండుక్రోసు లుంటుంది. మన ఊరికి మొగిలిచెర్ల మూడు క్రోసులు.

యము :- సూర్యుడప్పుడే పడమటికి పూర్తిగా వాలిపోయాడు. నాకేమో చాలా భయం వేస్తోంది. ఈప్రాంతం దొంగలికి పెట్టింది పేరు.

నీల :- నే నుండగా నీకేం భయమమ్మా! ఇదివరకేమో దొంగలూ గింగలూ ఉంటూవచ్చారు. క్రొత్తరాణీగారు గద్దె ఎక్కినతరువాత

దొంగలమాటే వినబడటంలేదు. ఆమె పేరుచెబితే దొంగలకు గుండెలో దడదడ.

యమున :- చల్లనితల్లి. ఏమి ఔదార్యం! ఏమి భక్తి! ఉత్సవాలు జరిగిన రెండు రోజులూ ఏకావీరాదేవి విగ్రహం ముందే కూర్చుండి ఉన్నది. వచ్చిన వారినందరినీ కన్నతల్లిలాగా ఆదరించింది.

నీల :- ఆమెవంటి ఇల్లాలు నభూతో నభవిష్యతి. ప్రజలందరూ ఆ తల్లి దయవల్ల కడుపులో చల్ల కదలకుండా సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు.

యమున :- ఆమె కూతురిద్దరూ ఆమె ప్రక్కనే కూర్చుండి ఉన్నారు. వారూ తల్లిగారిలాగే వచ్చినవా రందరికీ ఎన్నో గౌరవాలు చెల్లించారు.

నీల – తులసికడుపున గంజాయి పుడుతుందా అమ్మా! ఆమె రాణీకావడం ఆంధ్రుల అదృష్టం. ఈ చల్లనితల్లి ఈలాగే శతవర్షాలు పరిపాలించాలని ప్రజలందరూ వేయిమంది దేవుళ్ళను మ్రొక్కుకుంటున్నారు.

యమున :- ఆఖరిరోజున రాణీగారు బ్రాహ్మల కందరికీ జత సువర్ణాలూ వస్త్రాలు పంచిపెట్టించారని విన్నాను. నీకు కేమైనా లభించాయా?

నీల .- లభించకపోవడ మేమిటి? ఆనాడు సంతోషించకుండా పోయిన బ్రాహ్మడొక్కడు లేడు. అందరూ ఆనందంతో ఆశీర్వాదాలు కురియించి వెళ్లారు. నాకు రెండు వస్త్రాలు, పదివరహాల బంగారం లభించింది.

యమున :- ఆ బ్రాహ్మణోత్తముల ఆశీర్వచనాల ఫలితంగా ఆమె కూతుళ్ల కడుపున ఒక్క మగ మొలక ఉదయిస్తే బాగుండును.

నీల :- ఎందుకు ఉదయించదు తల్లీ! ఉత్తమ ద్విజులు హృదయపూర్వకంగా పలికిన వేదోక్తమైన ఆశీర్వాదాలు ఊరికే పోతాయా?

యమున :- శాస్త్రులుగారూ ! నాకేమో భయం ఎక్కువౌతోంది. ఆయన యింకా రాలేదు. మనం కూడా ఆయనతో కూడా వెనక్కి వెళ్ళనైనా వెళ్ళాంకాదు.

నీల .- ఆయన యెందుకు వెళ్ళినట్లు ? నాతో ఏం చెప్పకుండా "శాస్త్రులుగారూ ! ఇప్పుడే తిరిగి వస్తాను మీ కోడలితో ఆ చెట్టుక్రింద కూర్చోండి" అని మాత్రం చెప్పి వెళ్ళినాడు.

యమున _ ఏమీ లేదండి ! మొగిలిచెర్లలో ఏకవీరాదేవి గుడిలో ఎవరో చిత్రకారుడు చేసి చిత్రాలు అమ్మకానికి తెచ్చాడు. నేను మక్కువతో ఒకటి కొనుక్కున్నాను. వచ్చేటప్పుడు తొందరలో దాన్ని కిటికీలో పెట్టి మరచి వచ్చాను.

నీల .- ఆ చిత్రం తీసుకురావడానికి వెళ్ళాడా ? అయితే అక్కడ ఆలస్యమేముంది ? వెళ్ళడం ఆ చిత్రం తీసుకొని రావడమే కదా !

యమున - ఏదో చప్పుడవుతోంది ఆయన వస్తున్నాడనుకుంటా.

నీల - ( లేచి నిలబడి మొగలిచెర్లవైపు చూస్తాడు )

రంగన్న :- భీమన్నా ! ఇదే సమయంరా. మళ్ళీ ఆ వెళ్ళినాయన తిరిగి వచ్చేస్తాడో ఏమిటో.

రంగన్న ._ ( నీలకంఠశాస్త్రిల మీదపడి నోరు నొక్కుతాడు )

భీమన్న :- ( యమున కంఠం పట్టుకొని నోట్లో గుడ్డలు కుక్కుతాడు )

నీల .- ( అస్పష్ట కంఠంతో ) దొంగలు. వాదోయి, దొంగలు.

రంగన్న - నోరుమూయ్యి పాపనయ్యా ! ఆ పిల్లదాని బంగారం కూడా పెట్టుమందరి.

నీల :- ( అంగవస్త్రపు మూట చేతిలో చూపుతాడు )

[ ఇంతలో అశ్వారూఢుడు, ఖడ్గపాణి ఐన పురుషుడు ప్రవేశించి ]

పురు :- ఓరీ ! చోరాధములారా ! ఈనాటితో మీ ప్రాణాలు మిగలవు. కాచుకోండి.

లింగన్న }
భీమన్న } :- ( యమునా నీలకంఠులను విడచి పారిపోతారు )

పురు :- ( గుబ్బుందిగి ) శాస్త్రులుగారూ ! భయంలేదు. చూస్తోంది. పాపమే చిన్నది భయోద్వేగంచేత మూర్ఛాక్రాంతురాలైంది. ( ఆమె దగ్గరికి వెళ్ళి ఆమెతల తొడపై పెట్టుకొని చెదరిన కేశాలు సవరుతూ రెండో చేతితో విసురుతూ ఉంటాడు )

నీల :- నాయనా ! నీదయవల్ల బ్రతికాము. లేనిచో ఈపాటికి యమలోకంలో పాత కాపులమై ఉండేవాళ్ళం.

యమున :- ( కొద్దిగా కదుల్తుంది )

పురు :- శాస్త్రులుగారూ ! ఇదగో మంచితీర్థం ఉంటే ఇలా ఇయ్యండి. ఈమెచేత కొంచెం నీరు త్రాగిస్తాను

నీల - ( ఘూరి చెంబిస్తాడు )

పురు :- ( నీరు త్రాగింపును )

యమున :- ( నీరు త్రాగి కన్నులు తెరచి గద్గద స్వరంతో ) దొంగలు. రక్షించండి. శాస్త్రులుగారూ ! పయన వచ్చారా ?

నీల :- ( ఏడ్చుచు ) రాలేదు తల్లీ ! రాలేదు. ఈ మహానుభావు డెవరో మనిద్దర్నీ ఆ దుష్టుల బారినుండి రక్షించి పుణ్యం కట్టుకున్నాడు.

యమున :- ( కృతజ్ఞతతో యువకునివంక చూచి లేవబోవును )

పురు .- భయంలేదు తల్లీ ! భయంలేదు. కొంచెంసేపు విశ్రాంతి తీసుకో.

యమున :- ( తనలో ) ఈయన ఎవరో పరపురుషుడు. నేనిట్లా ఉండడం మంచిదికాదు. ( అని లేవబోవును )

ప్రతా :- ( ప్రవేశించి ) ఈయన ఎవ్వరో అపర మన్మథుడిలా ప్రకాశిస్తున్నాడు. యమున ఈయన తొడమీద పండుకొన్నది. శాస్త్రులుగారు ఉన్నారనైనా జంకలేదే.

నీల :- నాయనా! ప్రతాపా! వచ్చావా? ఈ మహానుభావు దెవ్వరో యిప్పుడు మా ఇద్దర్నీ దొంగల బారినుంచి రక్షించాడు. ఎల్ల కాలం మన మీయనకి ఋణపడి ఉండాల్సిందే.

ప్రతా :- ( నమస్కరించి ) అయ్యా! మీరు చేసిన మహోపకారం ఎన్నడూ మఱచిపోలేను. ఇవే నా కృతజ్ఞతా నమస్కారాలు.

యువ :- ఇందులో నేను చేసిందేముంది. నావిధి నేను నెరవేర్చినాను ఇంతాలస్యంగా బయల్దేరినారు మీరెక్కడికి వెళ్ళవలసి ఉంది?

నీల :- నాయనా! పెందలకడే బయల్దేరాము. ఇక్కడికి వచ్చిన తరువాత ఏకవీరాదేవి చిత్రం బసలో మఱచిపోయినమాట జ్ఞాపకానికి వచ్చింది. ఈయన దాన్ని తీసుకురావడానికి మొగిలిచెర్ల వెళ్ళి నాడు. మేమిక్కడ ఆయనరాక కెదురు చూస్తూ కూర్చున్నాం. ఇంతపని జరిగింది,

యువ :- మీ దేఊరు?

ప్రతా :- కోనేరు. ఇక్కడికి క్రోసుమాత్రం ఉంటుంది. మీ ఉపకారం మఱచిపోలేం. సెలవు తీసుకుంటాం. మీపేరు మేం తెలుసుకో వచ్చునా?

యువ :- తొందరగా బయల్దేరండి. అప్పుడే చీకటి పడింది. ( గుఱ్ఱము దగ్గరకెళ్ళి ) నాపేరు రుద్రదే (అని ఎక్కివెళ్ళిపోవును)

( ప్రతాపాదులు కోనేరు వంకకు నడచి పోదురు )

## మూడో రంగం

[ కోనేరు. ప్రతాపుని ఇల్లు. ప్రతాపుడు మంచముమీద పడుండిఉంటాడు. యమున ప్రక్క నిలబడి ఉంటుంది ]

యమున :- ఈపాలు కొంచెం త్రాగండి. అప్పుడే నాలుగు రోజులైంది. గుక్కెడు మంచినీళ్ళయినా పుచ్చుకొని. మొగిలిచెర్లలో ఆనాడు

దేవీప్రసాదం ఇంత పుచ్చుకున్నా రంతే. మళ్ళీ మెతుకు నోట బెట్టలేదు. ఈలా ఐతే శోషకూడా వస్తుంది.

ప్రతా :- మరేమీ భయంలేదు. నాకు శోషెందుకు వస్తుంది? వస్తేమాత్రం అంత ప్రమాదం ఏమిటి

యమున :- ఏమిటి అలా మాటాడుతారు? నాకేమీ తోచడంలేదు. వైద్యుడుకోసం కబురంపించనా?

ప్రతా :- వైద్యు డెందు కిప్పుడు? నాకు రోగ మేమైనా ఉంటేగా!

యమున :- మీ రీలా మంచం మెదపక ఉంటే నా మనసు మనసులో లేకుండా పోతోంది. ఏపని చేయడానికీ తోచడంలేదు. దాధేమిటో చెప్పరు. గ్రుక్కెడు మంచినీళ్ళయినా తాగరు. చివరకు నాతో మాటాడ్డం కూడా మానేశారు నేనేం పాపం చేశానో కాని.

ప్రతా :- నువ్వే పాపం చేయలేదు. నేనే మహాపాపం చేసుకున్నాను. దాని ఫలితం అనుభవిస్తున్నాను.

యమున :- మీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు ఈపాలు కాసినీ త్రాగండి. చల్లారి పోతున్నాయి.

ప్రతా :- నా కిప్పుడేం తాగాలనిలేదు. నీవుపోయి నీపని చూసుకో

యమున :- మీ పాదసేవ చేయడంకంటే నాకు వేరే పనేముంది? మీ వైఖరి చూస్తే నామనస్సు పరిపరి విధాల పోతోంది. చివర కాదేవి అనుగ్రహం ఈలా పరిణమించింది. పుణ్యానికి పోతే పాప మెదురొచ్చింది.

ప్రతా :- దేవి నెందుకు నిందిస్తావు? ఆమె అనుగ్రహం నీకు వెంటనే కనుపించింది కదా!

యమున :- ఏం కనిపించింది? ఇంటిలో అడుగు పెట్టాకో లేదో మంచం పట్టారు. నాలుగు రోజుల్లో చిక్కి శల్యమై పోయారు.

ప్రతా :- దీనికేములే. దేవతా ప్రసాదం వల్ల నీకోరిక ఫలిస్తే నాకేమైనా ఇబ్బందిలేదు.

యమున :- మరిల్లా మాట్లాడడం నాకు మహంత బాధ కలిగిస్తోంది. నా కోరిక ఒకటి మీ కోరిక ఒకటేనా. వివాహ సమయంనుంచీ క్రమక్రమాభివృద్ధి పొంది చిగిరించి పూలు పూచిన మన ప్రేమవల్లి మధురఫలం కాయాలనేకదా మన యిద్దరి ఉమ్మడి కోరిక.

ప్రతా :- నాకేమో లోకమంతా మాయామయంగా కనిపిస్తోంది. పూర్వపు మధుర వాంఛలన్నీ మట్టి కలసి పోయాయి. ఇప్పుడింక ఒకే ఒక్క కోరిక మిగిలింది సాధ్యమైనంత త్వరలో పరమేశ్వర సాయుజ్యం పొందుదామని.

యము .- మీకోరిక యెట్టిదైనా అందులో మీసహధర్మచారిణి పాల్గొకుండా ఉండదు.

ప్రతా :- ఔనునీపాతివ్రత్యం నాకు తెలియదా ?

( పిలుపు దిగ్గిర యమునా, యమునా అని పిలుపు )

యము :- సమయానికె నీలకంఠ శాస్త్రులవారు వచ్చారు. ఆయన కోసమే కబురంపిద్దా మనుకుంటున్నాను. ( వెళ్ళి తలుపుతీసి ) శాస్త్రులు గారూ ! నమస్కారం. మీకోసం కబురంపిద్దామనుకుంటూ ఉండగానే దేవుడిలా దయచేశారు. లోపలికి రండి.

నీల :- ప్రతాపుడున్నాడా? నాలుగురోజులనుంచీ ఎక్కడా కనుపించలేదు.

యము :- ఇంట్లోనే ఉన్నారు. ఈలా దయచేయండి. ఆవేళ రాత్రి గుమ్మంలో కాలుపెట్టామోలేదో మంచంపట్టారు.

నీల .- అలాగా. అందుకే ఊళ్లో ఎక్కడా కనిపించాడు కాదు. ఏమైనా జ్వరం తగిలిందా?

యము :- జ్వరంలేదు ఏమీలేదు. శారీరకమైన బాధగానీ పైకేమీ కనిపించడంలేదు. ఈనాలుగురోజులకే చిక్కి శల్యమైపోయారు. రండి, చూడండి. మీరిప్పుడు వచ్చారంటే కొంతధైర్యం కలిగింది.

నీల :- ( *ప్రతాపుని దగ్గరకు వెడతాడు. యమున వెనుకాలే ఉంటుంది.* )

ప్రతా :- శాస్త్రులు గారూ నమస్కారం. దయచేయండి ఈకుర్చీమీద కూర్చోండి.

నీల :- దీర్ఘాయురస్తు. అలాగే కూర్చుంటాను. నీవేమీ కదలబోకు. ఈ నాలుగు రోజులనుంచీ ఎక్కడా కనిపించలేదేమా అని ఒకమాటు చూచిపోదామని వచ్చాను. గుమ్మంలోకి రాగానే అమ్మాయి నీ వస్వస్థతగా ఉన్నావని చెప్పింది.

ప్రతా :- మరేమీ ప్రమాదం లేదండి. లేచి తిరగాలని లేక ఈలా పండుకున్నాను.

నీల :- ( *చేయి పట్టుకుని చూచి* ) జ్వరమేమీ ఉన్నట్టు లేదు. ఈ నాలుగు రోజుల్లోనే ఎంతగా మారిపోయావు. ముఖం పూర్తిగా పాలిపోయింది. మరొకరైతే ఆనవాలు పట్టడమే కష్టం.

యమున :- ఆనాడు మొగిలి చెర్లలో దేవీ ప్రసాదం పుచ్చుకున్నారంతే. మళ్ళీ నీళ్ళయినా ఒక చుక్క తాగలేదు.

నీల :- వైద్యుడికి కబురుచేయలేక పోయావా అమ్మా! ఇప్పుడు వెళ్ళి శరభరాజుగారిని తీసుకువచ్చేదా

ప్రతా :- అక్కరలేదండీ. రేపటికి దే సర్దుకుంటుంది. అసలు నాకు శారీరకంగా బాధేమీ లేనేలేదు.

యమున :- ఇప్పుడే వెచ్చబెట్టి తీసుకు వచ్చాను, ఈ కాసినిపాలు తీసుకోమనండి.

నీల :- నాయనా! ఈపాలు తాగి కొంచెంసేపు పండుకో, సాయంత్రం మళ్ళీవచ్చి అవసరమైతే శరభరాజుగార్ని ఓసారి పిలుచుకు

వస్తాను. (అని పాలిచ్చును)

పతా :- (పుచ్చుకొని త్రాగును)

నీల :- ఏదో ఈలా కొంచెం పుచ్చుకుంటూ ఉండాలి కాని లేకపోతే మఱింత నీరసం ఎక్కువై పోతుంది. నిన్నుచూచి అమ్మాయి చాలా బెంగ పెట్టుకుంది. ఈ ఊళ్ళో మీ దాంపత్యం, గుణ గణాలూ మెచ్చుకోనివారు లేరు. నేనింక వెళ్ళి వస్తాను. అమ్మాయీ నీవేం బెంగ పెట్టుకోకు. నేను సాయంకాలం మళ్ళీ వస్తాను. (పర్చీమీదనుంచి లేచి) అన్నట్టు మఱచి పోయాను. మొన్న మన్ని దొంగలబారినుండి కాపాడిన ఆ మహానుభావుడు నిన్న నేను కొండకి వెళ్ళివస్తూ ఉంటే దారిలో కనుపించాడు. ఏమి సౌజన్యం! ఏమి వినయసంపద!

యమున :- ఆయనకి మనం ఆజన్మం ఋణపడి ఉండాలి.

నీల :- నెమ్మదిగా అంటావేమిటి? ఆయనే ఆ సమయానికి రాకపోతే మనం చచ్చి స్వర్గంలో ఉండేవాళ్ళం.

ప్రతా :- ఆయన్ని ఒకసారి దర్శనం ఇప్పించ మనలేక పోయారా? యమున మఱోసారి చూచి సంతోషించేది.

నీల :- ఆయన యమున సంగతి మఱీ మఱీ అడిగారు ఈవేళకాని రేపు కాని తామే స్వయంగా చూడటానికి వస్తామన్నారు.

ప్రతా :- మీయింటికి వస్తే తప్పకుండా ఇక్కడికి కూడా తీసుకురండి.

నీల :- నీవు వేతే చెప్పాలా? ఆయన అసలు ముందే ఇక్కడికి వస్తారు. నేనింక వెళ్ళి వస్తాను నాయనా! ఆకలిగా ఉంటే ఎవ్వరంత ఎంగిలిపడు, మఱేమీ భయంలేదు.

ప్రతా :- సాయంకాలం మీరు తప్పకుండా రావాలి. మీరిక్కడ ఉన్న కాస్సేపూ మనస్సుకి కొంచెం శాంతి చేకూరింది. నమస్కారం.

నీల :- తిప్పరి వస్తాను. ( అని వెళ్ళుతి. యమున తలుపుదాకా వెళ్ళి తలుపువేసి వస్తుంది. )

యమున :- ఏమండి ! కొంచెం చాయా అన్నం తింటారా ?

ప్రతా - నాకిప్పు డేమీ అక్కర్లేదు. నీవు వెళ్ళితిను .సాయంకాలం ఆయన కూడా వస్తారేమో ! మళ్ళీ తీరుబాటు వుండదు.

యమున :- మీరు తినందే నేను తినడం అసంభవం. దేవి దయవల్ల మీరు స్వస్థులై లేచి తిరిగితే అదే నాకు పదివేలు

ప్రతా :- నాకోసం వృథాగా ఎందుకు శ్రమపడతావు ? నీవు వెళ్ళి భోజనం చేసిరా. నేను కొంచెంసేపు నిద్రపోతాను.

యమున .- ( కిటికీ తలుపులు వేసి ) వారిప్పు విశ్రాంతి తీసుకోంటి. నేను దేవీపూజ చేసుకొని యిప్పుడే వస్తాను ( అని వెళ్ళును )

## నాలుగో రంగం

[ యమున పూజాగృహంలో పరదేవత విగ్రహం ముందు కూర్చుని ఉంటుంది ]

యమున :- (పూజాదికం ముగించి) తల్లీ ! దిక్కులేని వారికి నీవే దిక్కు. అనన్యగతిక నైన రుక్మిణీనురాలిని రక్షించే భారమంతా నీదే. ఏం కర్మం చేసుకున్నానో కాని భర్తగారి మనస్సంతా విపరీతంగా మారిపోయింది. నాచేతినుంచి నీళ్ళైనా పుచ్చుకోవడంమానేశారు. చివరికి మాటాడడం కూడా కష్టమై పోతోంది. ఏనాంటి ప్రేమకు ఎంతలో ఎంత వ్యాఘాతం సంభవించింది? నేచేసిన తప్పేమిటో ఊహించలేకుండా ఉన్నాను. నీ పాద పద్మాలే దిక్కని నిరంతరం ఆరాధించే దీనురాల్ని ఇంత నిశితంగా పరీక్షించడం నీకు తగునా ?

ఆయనకు నా శీలాన్ని గురించే సందేహం పుట్టినట్టుంది. మాటలన్నీ ద్వంద్వార్థాలుగా గోచరిస్తున్నాయి. ఏమి చెప్పుకోవాలో తెలియకుండా ఉన్నది. ఎంతాలోచన చేసినా నే చేసిన దోషమేమీ కనపడ్డంలేదు. ఆరోజున దొంగలనుంచి మమ్మల్ని కాపాడి నాయన మూర్ఛాక్రాంతురాలనై పడిపోయిన నాతల తన తొడ మీద పెట్టుకొని ఉపచారాలు కావించారు. సరిగా ఆ సమయానికే శాస్త్రిగారు మొగిలిచెట్లనుంచి తిరిగి వచ్చారు. ఇదే వారి అనుమానానికి మనోవ్యాధికి కారణమై ఉండాలి దీన్ని తీర్చే ఉపాయమేమీ తోచడంలేదు. ఆయన దొంగలవారినుండి మమ్మల్ని రక్షించి ఎంతుపకారం చేశారో, నాతల తొడమీద పెట్టుకుని అంత ఉపకారం కావించారు ఆయనకు పరస్త్రీననే అనుమానం ఎందుకు తట్టలేదో! ఇంతకూ నా పూర్వకృత కర్మమే ఆయనచే ఆపని చేయించింది

తల్లీ! భర్తరక్షణ పరాయణా! ఈదీనురాలి హృదయశుద్ధి నీవెఱుగుదువు. ఈ ఆపత్సముద్రంనుంచి ఏలా తరింప చేస్తావో అంతా నీదేభారం.

ప్రతా :- (నిద్రలో కలవరిస్తూ) పరపురుషుడనే అనుమానం ఏమాత్రం లేకుండా ఆయన తొడమీద తలపెట్టుకుని పండుకున్నది. శాస్త్రులుగారు దగ్గర ఉన్నారనైనా సిగ్గుపడలేదు. ఛీ! స్త్రీల చిత్తాలు శరన్మేఘ చంచలాలు.

యమున :- నిద్రనుంచి లేచినట్లున్నారు. వెళ్ళి కొంచెం ఎంగిలి పడమని చెబుతాను. (లేచి అతని గదిదగ్గరకు వెళ్ళి తలుపు తీయును) ఏదో కలవరిస్తున్నారు. (విని) నా అనుమానం స్థిరపడింది.

ప్రతా :- (మేల్కాంచి తలుపువైపు చూచును)

యమున :- చాలాసేపు నిద్ర పోయారు. కొంచెం మనశ్శాంతి చేకూరిందా?

ప్రతా :- దానికేంలే కాని, ఆయన వచ్చారా?

యమున :- ఆయన ఎవ్వరు ? శాస్త్రులుగారా ?

ప్రతా :- కాదు. ఆనాడు దొంగల్ని పారదోలి మీ ప్రేమకు పాత్రులైనవారు.

యమున :- మీ మాటలు నాకర్థం కావడంలేదు. ఆయన ఇప్పు డెందుకు వస్తారు ? అస లెందుకు వస్తారు ?

ప్రతా :- ఏమో ఎందుకు వస్తారో, వస్తానన్నారని శాస్త్రులుగారు చెప్పలేదూ?

యమున :- వస్తే మీకు చెప్పకుండా ఉంటానా ? మీపాదదాసిమీద ఇంత కాఠిన్యం వహించడం న్యాయంకాదు.

ప్రతా :- ఎంత మాటన్నావు ? అంత మహాపురుషుడి తొడ ఉపధానంగా చేసుకో గల్గిన మహానుభావురాలవు నీవనవలసిన మాట కాదది.

యమున :- ప్రియురాలి హృదయశుద్ధి తెలిసి కూడా మీరలా మాటాడడం నా దురదృష్టం. మూర్ఛాక్రాంతురాలనై పడిపోయిన నాకాయన ఏమి చేశారో తెలియనే తెలియదు. దేవీ సాక్షిగా చెబుతున్నాను. ఏమాత్రం స్మృతి తెలిసి ఉన్నా నేనా విధంగా పండుకునేదాన్ని కాదు. మీరు వచ్చినప్పుడే నేనాయన్ని చూచాను. నాకూ కోపం కలిగినా ప్రాణాలు కాపాడిన పరమోపకారిని పరుష వాక్యాలతో భంగించడం ఉచితం కాదని ఊరుకున్నాను. తెలియక జరిగిన ఈ దోషం క్షమించి నన్ననుగ్రహించాలి.

ప్రతా :- అనుగ్రహించేందుకు నేనెవడిని? ఆయనే వస్తారుగా. అనుగ్రహిస్తారో! ఆగ్రహిస్తారో!

యమున :- వివాహం ఐనప్పటినుంచీ నన్ను చూస్తున్నారు. నా హృదయం ఎఱుగుదురు. మీరే ఈలా అనుమానిస్తే నాకు మరణంకంటె వేఱు శరణ్యంలేదు. మీ పాదసాక్షిగా ప్రమాణం చేస్తున్నాను. నేనేపాపమూ ఎఱుగను. మీ మనోవ్యాధికి కారణమిప్పుడు నాకు బోధపడింది. యథార్థం ఊహించి, నాదోషం క్షమించి, ప్రాణాలు నిలపండి. ఈ కార్యానికి కారణమై నేను మహాపరాధం చేశాను.

ఆ అపరాధం నేనెఱిగి చేసింది కాదు. అసలు నేను చేసిందే కాదు.

ప్రతా -: ఎందుకు విచారిస్తావు ? అపర మన్మథాకారం గలవాడు, ఐశ్వ ర్యంతో తూలతూగేవాడు, ఆపదనుంచి రక్షించినవాడు అక్షి గోచరుడైనప్పుడు ప్రేమిస్తే తప్పేముంది ?

యమున :- మీకు కలిగిన ఈ అనుమానాన్ని తొలగించడాని కాదేవికి తప్ప మరెవ్వరికీ శక్తి చాలదు. నేనెంత చెప్పినా మీకింక విశ్వాసం కలుగదు ఈ అవమాన భారంతో బ్రతికి ఉండడంకంటె చావడమే చాలా మేలు. ఎంతటి పవిత్రప్రేమ కెంతలో ఎంత భంగపాటు సంభవించింది ! ( ఏడ్చును ) చిన్నప్పటినుంచీ శాస్త్రులుగారు నన్నెఱుగుదురు. అనాడు కూడా ఆయ నక్కడే ఉన్నారు. ఆయన్ని అడిగి చూడండి నా అపరాధం ఏమైనా ఉందేమో. ( తలుపు చప్పుడగును ) అదిగో ! ఆయన కూడా సమయానికే వచ్చారు. ( అని తలుపుతీయుటకు వెళ్ళును )

పురు .- అమ్మా ! ప్రతాపుడుగా రున్నారా ?

యమున :- ( కోపములో ) ఎందుకు బాబూ ! ఉన్నారు. పరలోక ప్రయాణం చేయడానికి సిద్ధంగా ఉన్నారు. మొన్న చేసిన మహోపకారమే చాలు. ఎండంటి కాపరాన్ని బుగ్గిపాల్చేసింది. మళ్ళీ దయచేశారు. ఇంకా ఏం మహత్తరోపకారం చేస్తారో ! రెండుమాటితో మా ప్రాణాలే మటుమాయం చేసేస్తారు కాబోలును ! చాలు చాలు మీ ఉపకారం. దయచేయండి.

పురు - ( తెల్లబోయి ) అమ్మా. నేచేసిన నేరం ఏమిటో నాకు తెలియకుండా ఉన్నది.

యమున :- మీకెందుకు తెలుస్తుంది ? దాని ఫలితం అనుభవించే వాళ్ళకి తెలుస్తుంది. పరకాంతని స్పృశించడం పాపమని తెలిసి కూడా అనాడు నాతల తొడమీద పెట్టుకున్నారు. భయపారవశ్యంచే నిద్రిస మూర్ఛలో ఉండడంచేత నా తప్పుదేమీ కనబడిందికాదు.

లేకపోతే వెంటనే నాలుగు చీవాట్లూ పెట్టి ఉండేదాన్ని. మీరు దొంగల్ని తరిమి ప్రాణాలు కాపాడి నా ప్రాణాలకంటె ప్రియతరమైన పవిత్ర ప్రణయాన్ని భగ్నం చేశారు. ఉపకారం మిషతో మహాపకారం చేసిన మీరు తృణచ్ఛన్న కూపంలాగా కనబడుతున్నారు. మీ పుణ్యాన పంటవంటి మాకాపురం భస్మమై పోయింది. ఇప్పుడు ప్రాణాలు కూడా పోవడానికి సిద్ధంగా ఉన్నాయి. అదికూడా చూచి పోదామని వచ్చారు కాబోలును!

పురు :- అమ్మా! క్షమించండి. నేను చేసిన ఘోరమైన అపరాధం ఇప్పుడు తెలియ వచ్చింది. ఆనాడు దొంగలలో . . .

(నీలకంఠశాస్త్రి రాజభటుడితో ప్రవేశిస్తాడు)

రాజ :- (పురుషునికి నమస్కారం చేసి) మహామంత్రిగారు అత్యవసర రాజకీయ కార్యాలు ఆలోచించవలసి ఉండడంచేత దేవిగారికి ఈ పత్రం వ్రాసి పంపించారు. నేను శాస్త్రులుగారి ఇంటికి వెళ్ళి వారు తీసుకురాగా ఇక్కడికి వచ్చాను. (అని పత్రం అందిస్తాడు)

యమున :- దేవిగారంటాడేమిటి! (అని తెల్లబోతుంది)

నీల :- అమ్మా! ఈవేళ మన నేత్రాలు సాఫల్యం చెందాయి. రుద్రాంబా మహాదేవిగారి దివ్య దర్శనం లభించింది. ఆనాడు మనల్ని రక్షించిన పుణ్యాత్మురాలీమెయే.

యమున :- (రుద్రాంబ కాళ్ళమీద పడి) దేవిగారి యెడల క్షమించరాని అపరాధం చేశాను. ఈదోషానికింక ప్రాయశ్చిత్తం ఉండదు.

రుద్రాం :- (లేవనెత్తి) లే తల్లీ! లే వేషంచే పురుషుడుగానే ఉన్నా నిజానికి స్త్రీనే కావడంచేత సహజ ప్రకృతి మఱచిపోలేక ఆనాడు నిన్నలా స్పృశించి నీకు కడగండ్లు కల్గించాను. నీవే నన్ను క్షమించాలి రా లోపలికిరా! నీ భర్తగార్ని చూద్దాం.

(రాజభటుడు తప్ప అందరూ లోపలి కేగుదురు)

యమున .- (ముందేగి) ఈనాడు మనభాగ్యం పండింది. రుద్రాంబా మహారాజ్ఞిగారు మనగృహం పావనం చేశారు. ఏకవీరాదేవి అనుగ్రహం ఊరికే పోతుందా!

ప్రతా :- (మంచంమీదనుండి లేచి రుద్రాంబకు నమస్కరించును.)

రుద్రాం :- నాయనా! నేను తెలియకచేసిన నేరం మీకు ప్రాణసంకటం కలిగించింది. క్షమించండి.

నీల :- గ్రీష్మాతపాతిరేకంచేత ఎండి వాడడానికి సిద్ధంగా ఉన్న లతలకు తొలకరి వానలాగ దేవిగారి రాక ఈ ప్రతాపుడి జీవితానికి ఇంతింతనరాని చైతన్యశోభ కలిగించింది

ప్రతా .- (యమునవంక చూచి) యమునా! నీ హృదయ పారిశుద్ధ్యం తెలిసికూడా అజ్ఞాన వశాన్న నిన్నవమానించి నీమనసు నొప్పించాను క్షమించు

రుద్రాం :- దంపతులారా! మీమిద్దరు దిత్యమనస్కంగా రాజధానికి పోవలసి ఉంది. దేవిదయవల్ల మీరింక సుఖజీవితం చేస్తూ పుత్ర, పౌత్రాభివృద్ధి గాంచి వర్ధిల్లండి. మీ మెప్పుడైనా అవకాశం ఉన్నప్పుడు మళ్ళీ మీ పవిత్ర గృహం దర్శిస్తాము. శాస్త్రులుగారూ! నమస్కారము. (అని రాజభటులతో వెడలిపోవును)

నీల - ఆనాడే నా కనుమానం కలిగింది. ముఖంలో స్త్రీలాలిత్యం మూర్తీభవించినట్లు కనిపించింది. కాని అప్పుడు ప్రదర్శించిన పరాక్రమ విశేషంచేత పురుషుడే అని అనుకున్నాను.

ప్రతా :- పేరేమిటని అడిగితే ఆమె ఏదో చెప్పి తొందరగా గుర్రం ఎక్కి వెళ్ళిపోయింది. రుద్రదే అన్నంతవరకు వినిపించడం చేత నేను రుద్రదేవు డనుకున్నాను.

యమున .- ఆనాడు కళ్ళుతెరచి చూచేదాకా స్వప్నములట్టి నేను స్త్రీయే అని తలపోశాను.

ప్రతా :- యమునా! అనుమాన మేఘాలు పటాపంచలై హృదయాకాశం నిర్మలతరంగా భాసిస్తోంది. రా. దేవీపాదపద్మాలకి నమస్కరించి భోజనం చేద్దాం.

యము :- శాస్త్రిలుగారూ! మీరు లోపలికి దయచేయండి. మీదయవల్ల పట్టిన ముసురు పట్టినట్లుగానే విచ్చిపోయింది.

నీల :- అంతా దేవిదయ. మీరువెళ్ళి భోజనం చెయ్యండి. నేను పోయి సాయంసంధ్యావందనం చేసుకుంటాను.



# దేశోద్ధారక గ్రంథమాల (స్థాపితము 1938)

"ఈ గ్రంథమాలరూపమున తమరు చేయుచున్న ఆంధ్రభాషా సేవ ప్రశంసనీయమై యున్నది."

—ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు

"ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి శ్రమించునట్టి వీరి గ్రంథమాలను అందరునూ ఆదరించి తమ విధిని నెరవేర్చ వలసియుందురు."

—కీ॥ శే॥ సురవరము ప్రతాపరెడ్డిగారు

"దేశోద్ధారక గ్రంథమాలను స్థాపించి ఆంధ్రదేశమునకు గొప్ప భాషా సేవచేసిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు గారిని చిరస్మరణీయులుగా చేసియున్నారు."

—శ్రీ కొండా వెంకటరంగారెడ్డి

"మిత్రులందరు గ్రంథమాల యొక్క ప్రచురణములను పొంది ఈ కార్యమును జయప్రదముగ నిర్వహించుటలో సహాయపడుదురని ఆశించుచున్నాను"

—శ్రీ మందుముల రామచంద్రరావు

"ప్రతి పుస్తకము ఆకర్షవంతముగను, ఉపయోగకరముగను ఉన్నది. ........ఈ గ్రంథమాల ఆంధ్రదేశమునకు అమూల్యమగు సేవచేయుచున్నదనుటలో నెట్టి యతిశయోక్తి లేదు."

—శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు

"ప్రజలకు వినోదం కలిగించడంవల్ల గ్రంథమాలను అభివృద్ధి చేసుకొనే దృష్టి ప్రకాశకులకు లేదు. 'ప్రజలకు ఈ దినాలలో అత్యావశ్యక మయిన విజ్ఞానం కలిగించాలి' అన్న దృఢ సంకల్పం ప్రతి ప్రచురణము నందు ప్రస్ఫుటంగా కనబడుతూ ఉంది."

—కాగడా 10-2-1940

# ప్రచురణలు

# నూతన ప్రచురణలు

## 13. జైలులోపల (కథానికలు) వెల 0-10-0

రచయిత: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి

" కొత్తజాతికథలు మీరు తెలుగులో సృష్టిస్తున్నారు.......... కథలు హృదయవిదారకంగా ఉన్నవి. పడమటి దేశాల్లో ఇట్టి వాఙ్మయసృష్టి సంస్కరణాలకి దారితీసేవి. మన దేశంలో ఆలనా పాలనా లేదు. "

—శ్రీ చింతా దీక్షితులు

" యిలాంటి కథావస్తువులు యింతవరకు యెవరూ తీసుకోలేదనే నా అభిప్రాయం. ఈ వస్తునిర్ణయంలోనే మీరు నవ్యమార్గం అనుసరించి, సామాజికంగా చచ్చినవాండ్లతో సమానమని నిర్ణయించబడ్డ ఖైదీల జీవితాలు ఈ విషసమాజచరిత్రకు స్మృతిచిహ్నాలుగా పనికి వస్తాయని చక్కగా నిరూపించారు. "

—శ్రీ ధరణికోట శ్రీనివాసులు

" జైలుసంస్కర్తలు గ్రహించాల్సిన విషయాలు బలంగా ప్రతిపాదించబడడం గమనార్హం నేరస్తులు వస్తుతః నేరస్తులుకారు. వారు పరిస్థితులకు లొంగిపోయి నేరస్తులు కావించబడ్డారన్న అభిప్రాయం ప్రతి రచనా కలిగిస్తుంది. "

—గోలకొండ పత్రిక

" .......... ఇవి ఉన్నసమస్యల వాస్తవికతను, మానవ స్వభావములను, పరిస్థితుల సత్యస్వరూపమును అతి సహజము । హృదయంగమముగ తెలుపుచున్నవి, ఇవి రచయితకు గల సంస్కారమును, భావోద్వేగమును వెల్లడించుచున్నవి. "

—సుజాత

" ........ దైనందిన జీవితంలో మనం చూచే సాధారణఘట్టాలనే, కథగా తీసుకొని సాధారణం అనుకునేటట్టు గాక ఉత్తమంగా సృష్టించారు. ...... ఆళ్వారుస్వామి గారు తమ జేలు జీవితానుభవంలోంచి కొన్ని అమూల్య విషయాలను ముచ్చటైన పుస్తకంద్వారా అందజేసి నందులకు అభినందనీయులు. "

—స్రవంతి

# 14. నా గొడవ (గేయాలు)    వెల 1-8-0

## రచయిత: శ్రీ కాళోజీ నారాయణరావుగారు

"కాళోజీ నిఖిలాంధ్రకవి. .....ఆయన తన ఖండకావ్య సంపుటానికి 'నాగొడవ' అని పేరు పెట్టారు.. కాని ఇవి విశాలజగత్తు ప్రజలందరి గొడవ. ఇది మనం మననం చేసుకోవాల్సిన పుస్తకం. యుద్ధంలో పాల్గొన్న కవులంతా చెల్లాచెదరుగా పారిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలో నిలబడి మహావిశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాశాడు. కాళోజీ లూయీ ఆరగాన్ వంటివాడు"

—శ్రీ. శ్రీ

"కాళోజీ కవిత్వం సమాజానికి హెచ్చరిక వంటిది.... . వెనుకటా ఈయనకు రేఖా మాత్రంగా వ్యుత్పాసం ఉందేమో గాని అతను చెప్పదానికి విలువగానివి కాళోజీ చెప్పింది తప్పులేదు." ఆడంబరంలేని, అలంకారాల ఆరభటిలేని నిసర్గమైన కృతి కాళోజీ కావ్య సంపుటి." ..వ్యంగ్యాత్మక విమర్శాయుత హాసగతికలు రచించి కాళోజీ కవితాజగత్తులో క్రొత్తపల్లవాన్ని కలిగించాడు."

—శ్రీ దాశరథి

"ఈ కవిరచనలో అంతటా ఒక విశిష్టమైన స్వతంత్ర వ్యక్తిత్వం సుస్పష్టంగా కనిపిస్తున్నది........కాళోజీ వారి పేరు. 'నాగొడవ' చదువుతున్నపుడు మనమొక్క వినూత్నమైన అనుభూతి ప్రపంచములోకి వెళ్లిపోతాము......., ఈయనలో గల సత్యాన్వేషణాసక్తి సంకుచితమైన రాజకీయ సిద్ధాంతాలకు తాత్కాలికమైన అభిప్రాయాలకు అతీతమైన కాలపురుషుని మాట నిర్ఘోషిణి లో వినబడుతూఉంటుంది. నేటికాలపు కవితాపరిణతి అవగాహన చేసుకోదలచిన భావుకులందరు తప్పకుండా చదువవలసిన ఖండకావ్య సంపుటి"

——భారతి

"......... ఈ సంపుటిలో ప్రతి గీతం ఒక పరమ సత్యం. ఆ "సత్యం" కల్పనా కథలకంటె చిత్రమైంది కాదూ? తెలంగాణా ప్రజల కన్నీటిలో ఎన్నెన్ని కలలు కలవో చూడదలచినవారికి కాళోజీగారి "నాగొడవ" కనువిప్పు."

—కిన్నెర

# 15. ఉదయ ఘంటలు. వెల 2-4-0

(56 అఖిలాంధ్రకవుల గేయసంపుటి)

“..... ఈ సంకలనంలో ఇంతకు పూర్వం అజ్ఞాతంగా ఉండి పోయిన ఉత్తమ ఖండకృతులెన్నో సేకరించి ప్రకటించారు. పేరుపొందిన రచయితల రచనలలోనించికూడా ఇలాంటి కృతులే సేకరించడంవల్ల ఈ సంకలనానికివిషయంలో ఒక ప్రత్యేకత వచ్చింది. ఇది ఆధునిక కవితాభిమానులందరూ తప్పకుండా పరిశీలించ వలసిన సంపుటి”

— ఆంధ్ర పత్రిక.

“ఇప్పుడు ఆంధ్ర దేశంలో అనేక తరహాల కవిత్వం ఆవిర్భవిస్తున్నప్పటికి అందులో ప్రధాన ప్రవాహం అభ్యుదయ సాహిత్యం. దీనికికారణం దినదిన ప్రవర్ధమానమౌతున్న సామాజిక చైతన్యమూ, ప్రజాజీవితమూ వీటిలో వెల్లి విరియడమే. ఇలాగ వెల్లివిరిసిన అఖిలాంధ్ర కవులగీతికా సంపుటి “ఉదయఘంటలు.” ......అనేకకవుల చక్కని గీతాలు యిందులో ప్రచురితమైనాయి. .... సంపాదకుల, ప్రచురణ కర్తల కృషి కొనియాడతగింది.”

— విశాలాంధ్ర.

“........నవ్యకవిత్వోద్యమంలో పాల్గొన్న వారిరచనలను ఏర్చికూర్చి, .......ఒక్క సంపుటిలో అందించినందుకు అభినందనీయులు. ....... ఆధునిక ఆంధ్ర రచనావిధానంలో వచ్చిన మార్పుయొక్క సమగ్ర స్వరూపాన్ని తెలిసికోవాలంటే ఈగ్రంథం చాలావరకు సహాయపడుతుంది.”

— బృందావని.

“......సొగసులుతీరి పకపకాన రంగురంగుల రోచిస్సులు విరజిమ్మే మణిలా కలరవాలను కురిపిస్తూ, వంపుసొంపునా కర్పూరకాంతులీనే కపోత

కంఠంలా, వివిధ సౌరభాలను, వెలార్చే కదంబ ప్రసూనమాలలా, రంగు, రుచి, వాసనల సొరు తీరులు గల అపురూపపు ''ఉదయ ఘంటలు'' నినాదతరంగాలు అనవరతం మనశ్రవణ మనోమస్తిష్క ఫలకాలను తాకు తూనే వుంటాయనడం అత్యుక్తికాదు.''

—ఆంధ్రప్రభ.

''ఈ సంకలనంలో యావదాంధ్ర కవులు సమిష్టిగా ఏకముఖాన మనకు మేల్కొలుపులు పాడుతున్నారు. ఇవి ఉదయ ఘంటలు ......ఇవి హృదయ ఘంటలు.......... మనకావ్య సాహిత్యంలోని విశిష్టభాగాలతో ఒక్క ''తెలుగు ఎంథాలజీ'' కూడా రాలేదని నిరుత్సాహ పడుతున్న ఈనాడు కనీసం గేయసాహిత్యంలోని మచ్చు రచనలతోనైనా ఈసంపుటి వెలువడడం ఆంధ్ర సాహిత్యానికి ఒక అభ్యుదయమేనని దీనిని పరిశీలించిన వారు అంగీకరించుతారు.''

—స్రవంతి.

''......కేవలము జీవితోత్సాహమూ, సౌందర్య సందర్శనమూ మాత్రముగాక, పీడితసోదరబాధానుకంపనమూ, నిత్యనూతన చైతన్య కల్పిత చిత్రసృష్టి.. ...''ఉదయ ఘంటలు'' వారిలోనే మోగుతాయి. ........ఈ సంపుటము నిండా బ్రతికిఉన్న వ్యావహారికంలోనే తళుక్కు మన్నాయి భావాలు. ........భావవిప్లవానికి ''ఉదయ ఘంటలు''లో ఆట విడుపు. ''మాడుపాట్లతోడ నీవు గాడిద చాకిరి చేయగ లేకపూసి, మూతి నాకుతుచ్చులకే వైభవాలు

—అనీపుట్టకిల్లు కదిల్చేభావాలు ''ఉదయఘంటలు''లో ఎన్నైనాకలవు.''

—కిన్నెర.

''ఈ అధునిక ఖండకావ్య సంపుటి పురోగమిస్తున్న నవ్యాంధ్ర సాహిత్య పోకడలను ప్రస్ఫుటింప జేస్తున్నది. ఇందులో........దేశీయ సాంఘిక సమస్యలు, ఆర్థికసమస్యా లోపాలు, ప్రపంచ క్లిష్టపరిస్థితులు,

పీడితమానవ సంఘటనలను యితివృత్తముగాగలవి. ......చక్రపాణి ముద్రణ, తయారీలతో ఆకర్షణీయంగా తయారైన యీగ్రంథము ముద్దులు, మూటగట్టుచు ఉత్సాహానందముల పెంపొందించుచున్నది."

—గృహలక్ష్మి.

"ఈ సంవత్సరం—చిరకాలంతర్వాత కవితా సంపుటాలు వచ్చాయి. అందులో ఉత్తమమైనది వేసినగౌరవం తెలంగాణావారికే దక్కింది. అఖిలాంధ్ర కవుల రచనలతో కూడిన "ఉదయ ఘంటలు" ఒక గొప్ప కృషిఅని చెప్పకతీరదు."

—శ్రీవాత్సవ.

---

మొదట రు. 10 - 0 - 0 చెల్లించి గ్రంథమాలలో సభ్యులుగా చేరవచ్చును. అట్టిసభ్యులకు రు. 11 - 4 - 0 వెలగల మా ప్రచురణములు అందజేయ బడును. అంతకుపైగా చెల్లించు ద్రవ్యాన్ని విరాళముగా స్వీకరించి మాగ్రంథాలు పంపుచుందుము.